# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 42. సంచిక 237 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 29-11-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా



# చెన్నపట్టణంలో రష్యా ప్రధాని బుల్గానిన్‌కు అఖండ స్వాగతం

## రెండు రాష్ట్రాల వాదానికి కాంగ్రెసు ప్రాతికూల్యం

### అధిష్ఠానవర్గానికి చెప్పుకొనడానికి ఢిల్లీకి మంత్రి యాత్ర

హైదరాబాద్, నవంబరు 27. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం నివేదికపై ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణరావుగారు ప్రస్తుతం జరుగుతున్న శాసనసభా సమావేశాలలో ప్రతిపాదించే తీర్మానంపై హైదరాబాద్ శాసనసభ కాంగ్రెసుపార్టీ సభ్యుల ఏకగ్రీవాభిప్రాయం సంపాదించడానికి జరిగిన ప్రయత్నాలు నేటిరాత్రి విఫలమైనవి. ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు సూచించిన ఈ తీర్మానాన్ని కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆమోదించారు.

రెండు రోజులలో మొత్తం 12 గంటలు తీర్మానాన్ని శాసనసభా కాంగ్రెసుపార్టీ సభ్యులు చర్చించారు. ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు ప్రతిపాదించే తీర్మానం హైదరాబాద్ రాష్ట్రాన్ని విభజించి రాష్ట్రంలోని తెలంగాణా, మరాట్వాడా, కర్ణాటక ప్రాంతాలు ...

... నట్లు శ్రీ రాజు చెప్పారు.

విశాలాంధ్ర వెంటనే ఏర్పాటు చేయాలనే విషయంలో ఆంధ్రులలో సర్వ సాధారణంగా వున్న అభిప్రాయాన్ని కూడా ఆయనకు తెలిపారు.

ఈసందర్భంలో కాంగ్రెసు అధి...

### రెండురాష్ట్రాలవాదం వద్దు

### విశాలాంధ్రకోసం సభలు సమావేశాలు

ఖమ్మంమెట్టు, నవంబరు 22. హైద్రాబాదు రాజధానిగా విశాలాంధ్రను ఏర్పాటు చెయ్యడానికి వెంటనే చర్యలు తీసుకోవలసిందిగా ఈ నెల 25 వ తేదీ ఇక్కడ జరిగిన ఖమ్మంజిల్లా విశాలాంధ్రవాదుల సదస్సులో తీర్మానించారు. పురపాలకసంఘం అధ్యక్షుడు చిర్రావూరి లక్ష్మీనరసయ్యగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు కె. నారాయణరావు, గెల్లా కేశవరావు, కోమసగిరి సుందరరామారావు, పి. వి. రమణయ్య, ఎన్. గిరిప్రసాద్ మొదలైనవారు మాట్లాడారు.

### నాగులవంచ విద్యార్థుల విజ్ఞప్తి

విశాలాంధ్రను వీలైనంత త్వరగా

5 వ పేజీ 1 వ కాలం చూడుడు.

## నగర మంతటా తిరునాళ్ల కోలాహలం

### నిర్విరామ కార్యక్రమంలో బాలల పూలవాన ఉపచారం

మద్రాస్, నవంబర్ 28: సోవియట్ ప్రధాని శ్రీ బుల్గానిన్, కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ కృష్చేవ్‌లు నేడు నవరీవారంగా తమ విమానాల్లో మధ్యాహ్నం 12-15 కు మీనంబాకం విమానాశ్రయంలో దిగారు. సోవియట్ నాయకుల విమానం భూమిమీద వాలగానే 20 వేల మంది జనం సంతోషంతో కోలాహలం చేశారు. విమానంలోనుంచి శ్రీ బుల్గానిన్ మొదట దిగారు. ఆయన వెనకాలే శ్రీ కృష్చేవ్ వచ్చారు.

మద్రాస్ గవర్నర్ శ్రీ ప్రకాశ్ వారికి పూలమాలలు వేసి, సుందరనగరమయిన మద్రాసుకు ఆహ్వానిస్తున్నామన్నారు. ముఖ్యమంత్రి కామరాజ్‌నాడార్, మాస్కోలో భారత రాయబారి కె. పి. ఎస్. మీనన్, హైకోర్టు న్యాయమూర్తులు, ఉన్నతాధికారులు మొదలైనవారంతా వున్నారు. సోవియట్ నాయకుల ఫొటోగ్రాఫర్లు కోరినన్ని ఫొటోలు తీసుకునే అవకాశం ఇచ్చారు.

... నాయకులకు ప్రధాన న్యాయమూర్తినీ, మంత్రులనూ, శాసనసభల అధ్యక్షులనూ, మేయరును పరిచయం చేశారు.

ఆ తరవాత విమానాశ్రయ భవనానికి వెడుతూ అనేకమంది స్త్రీలు, పిల్లలు స్వాగతవాదాలను చేస్తూఉండటంచూసి సోవియట్ నాయకులు తమ టోపీలను తీసి ఊపారు. శ్రీ కృష్చేవ్ రెండు చేతుల్నీ ఎత్తి జోడించి 'నమస్తే' అన్నారు. విమానాశ్రయ భవనందగ్గర స్వాగతం ఇచ్చేందుకు వచ్చిన జనం అభినందనలను అందుకుని గవర్నరుతో సహా కారులో రాజభవనానికి బయలుదేరారు.

### పూలవాన

రాజభవనానికి కారు వెడుతుంటే, అయిదుమైళ్ల దారిపొడుగునా వేలకొద్దీ

5-వ పేజీ 4 కాలం చూడుడు

## శాసనసభ్యులతో జిల్లాబోర్డులు వద్దు

### అధిష్ఠానవర్గపు సలహా

కర్నూలు, నవంబరు 28: శాసనసభ్యులతో జిల్లా బోర్డులను పునర్నిర్మించాలని శాసనసభ ఐక్య కాంగ్రెసు పార్టీ లోగడ చేసినసూచనను కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆమోదించలేదని విశ్వసనీయంగా తెలుస్తున్నది.

ప్రస్తుతం జరుగుతున్న శాసనసభా సమావేశాలలో చర్చించవలసిన కార్యక్రమాన్ని నిన్న జరిగిన సమావేశంలో శాసనసభ కాంగ్రెసుపక్షం పరిశీలించారు.

సమావేశానంతరం పార్టీ కార్యదర్శి కె. విజయభాస్కరరెడ్డిగారు పత్రికా విలేఖరులకు ఇట్లా చెప్పారు: "ఎస్టేట్ భూముల చట్టాన్ని పార్టీ పరిశీలించి, ఆమోదించి పరిశీలక సంఘానికి పంపించాలని నిర్ణయించారు.

"జిల్లాబోర్డుల ప్రత్యేకాధికారుల ఉద్యోగకాలాన్ని మరొక సంవత్సరం పొడిగించేందుకు ఉద్దేశించిన జిల్లా బోర్డుల సవరణ బిల్లును ఆమోదించారు.

కొన్ని నీటి పారుదల నిర్మాణాల కింద సాగయ్యే భూములపై విధిగా నీటితీరువ విధించే బిల్లును కూడా పరిశీలించి స్థూలంగా ఆమోదించారు.

"రాంపేరు కింద, మరికొన్ని చోట్ల రాజకీయ బాధితులకు భూములను దఖలు చేయడంలో వస్తున్న వ్యక్తిగత చిక్కులను పరిశీలించడానికి ఆరుగురు సభ్యులతో పార్టీ ఒక ఉప సంఘాన్ని నియమించారు."

అమ్మకంపన్ను ఇంకా కట్టుదిట్టంగా వసూలు చెయ్యడానికి ఒక సంఘాన్ని నియమించినందున అమ్మకం పన్ను చట్టం సవరణబిల్లును ప్రస్తుతానికి వాయిదా వెయ్యాలని శాసనసభ కాంగ్రెసు పార్టీ తీర్మానించారు.

డిసెంబరు 8 వ తేదీన పార్టీ మళ్ళీ సమావేశమవుతుంది.

ఎస్టేట్ భూములచట్టం సవరణబిల్లు ఉద్దేశాలను ప్రణాళికల మంత్రి కళా ...

## బుల్గానిన్: కృష్చేవ్, నువ్వు ఇక్కడే ఉండిపో

### కృష్చేవ్: అదే ఆలోచిస్తున్నాను

మెట్టుపాళయం, నవంబర్ 28: తమలపాకుతోటలను చూసి ముగ్ధుడయిన శ్రీ కృష్చేవ్‌ని చూసి ప్రధాని శ్రీ బుల్గానిన్ "నీకు ఈ దేశం ఇంత బాగా వున్నదే, ఇక్కడే ఉండిపోకూడదు" అని అడిగారు.

దానికి ఆ సరదా మనిషి జవాబిస్తూ "అదే నేనూ ఆలోచిస్తున్నానయ్యా!" అని జవాబిచ్చారు.

## విదేశీ పెట్టుబడుల పెరుగుదల

### రిజర్వుబ్యాంకు సమీక్ష

బొంబాయి, నవం 27: మనదేశంలో విదేశీయుల పెట్టుబడి, వ్యాపారసంస్థల నిర్వహణ ఏవిధంగా వున్నదో రిజర్వుబ్యాంకు పరిశీలించి ఒక నివేదిక ప్రచురించింది. 1948 నుంచి 1953 చివరవరకూగల పరిస్థితుల పరిశీలన ఫలితమిది.

1953 డిసెంబరులో విదేశాలలో వుండేవారు ఈ దేశంలో నిర్వహిస్తున్న వ్యాపారసంస్థలు 565 వున్నాయి. వీటిలో ఆ నిర్వాహకులకుగల వాటాల విలువ సుమారు 117 కోట్లు. పెట్టుబడీ, వాటాలూ ఏమీ లేకుండా వారి నిర్వహణలోగల వ్యాపారసంస్థలు 91. 74 కోట్ల రూపాయలు మూలధనం గల 282 వ్యాపారసంస్థలను విదేశీయుల యాజమాన్యంగల 36 మేనేజింగు ఏజెన్సీలు నిర్వహిస్తున్నాయి. ఈ 282 సంస్థలలో వస్తువులు వుత్పత్తి చేసేవి-68, తేయాకు మొదలైన తోటలు నిర్వహించేవి-109, వర్తకం చేసేవి-18, గనులు తవ్వించేవి-17, మిగతావి చిల్లర సంస్థలు. వీటిలో నూరుసంస్థలు తేయాకు తోటలనే నిర్వహిస్తున్నాయంటే ఆవ్యాపారంఎంతగా విదేశీయుల చేతుల్లో వుండిపోయిందో విదితం, ఈనూరుసంస్థలుకూడా ఇంగ్లాండులో వున్నవారిచేతనే నిర్వహింపబడుతున్నాయి.

విదేశీయుల నిర్వహణలో వున్న మొత్తం 565 సంస్థలలో విదేశాలలో వుండేవారికి 40 % కు మించి వాటాలు గల సంస్థలు 318. పూర్తిగా వారి పెట్టుబడిగల సంస్థలు 128. 60 % కు మించి వాటాలుగల సంస్థలు 60.

మొత్తంమీద ఈ పరిశీలనాకాలంలో మన దేశంలో విదేశీ పెట్టుబడులు సన్నగిలినట్లు ఇదివరకు వెలువడిన వివరాలు తప్పు అనీ, సన్నగిలకపోగా 132 కోట్లవరకూ పెరిగినవనీ ఈ పరిశీలనవల్ల తేలినది.

## నారికేళాలంటే రష్యన్లకు రుచి

### తమ దేశంలో లేవని కృష్చేవ్ విచారం

ఉదకమండలం, నవంబరు 27: రష్యానాయకులు రాత్రి ఉదకమండలంలో గడిపారు. ఇక్కడ వీరు కాఫీ తేయాకుతోటలను చూచారు. తేయాకు తోటల సంగతి వీరికి తెలుసుగాని, కాఫీ మొక్కనే వీరు ఎప్పుడూ చూడలేదట. అందువల్ల వీరికి కాఫీని నాటడం దగ్గరనుంచి కొయ్యడందాకా నడిచే పనినంతా ఒక తోటలో చూపించారు.

### తేయాకు అపచయం

శ్రీ కృష్చేవ్ వరికోతలో ఎట్లా ఘటికుడో, తేయాకు అపచయంలో కూడా అట్లాగే ఘటికుడని తేలింది. నీలగిరి ప్రాంతాల్లో ఒక తేయాకు తోటను చూడడానికి పోయినప్పుడు రెండు ఆకులు ఒక మొగ్గ తుంచి, తేయాకు పంటలో తన నేర్పరితనాన్ని చూపించారు. రష్యాలో తేయాకు అపచయం అంతా యంత్రాలద్వారా సాగుతుందని, శ్రీ కృష్చేవ్ తెలియజేశారు.

### పార్టీ ముందా - ప్రధాని ముందా!

ఒకచోట శ్రీ కృష్చేవ్ శ్రీ బుల్గానిన్‌లకు ఎవరు ముందుగా కొకచెట్టు ఎక్కాలి అని తర్జుమా వచ్చింది. కొంతసేపు ఈ తర్జుమా నడిచిన తర్వాత శ్రీ బుల్గానిన్, కృష్చేవ్‌నే ఎక్కమన్నారు. "మీరు పార్టీనాయకులు. అందువల్ల మీరే ముందు ఎక్కండండి!" అన్నారు. కాని శ్రీ కృష్చేవ్ అందుకు అంగీకరించలేదు. "మీరు మంత్రిమండలి అధ్యక్షులు. ముందు మీరే ఎక్కాలి!" అన్నారు. ఇంతా జరిగిన తర్వాత ఎవ్వరూ ఎక్కలేదు.

### తమదేశంలో కొబ్బరిచెట్లులేవని విచారం

కోయంబత్తూరునుంచి ఉదకమండలానికి వెళ్లేదోవలో, ఒక గ్రామంవద్ద ఆగి కొబ్బరిబొండాలనీరు త్రాగారు. "గ్లాసులో పోసుకు త్రాగేకన్న సరాసరిబొండాంనుంచే త్రాగటం మంచిది" అని గ్లాసులు వద్దన్నారు. తర్వాత బొండాలు పగలగొట్టించి లేతకొబ్బరిని తిన్నారు.

"ఇది భలేబావుంది దివ్యంగాఉంది. కానీ మాదేశంలో నారికేళాలు పండవే అని విచారిస్తున్నాను" అన్నారు శ్రీ కృష్చేవ్.

తర్వాతకొబ్బరిమొక్కలు నాటారు. శ్రీ కృష్చేవ్ తన రెండుచేతులూ పైకి సాచి, "ఈ మొక్క మంచివృక్షముగు గాక, ఈ పొలం యజమానికి సుఖము ధనము ఇచ్చుగాక" అన్నారు.

## విశాలాంధ్ర సమస్యపై ఢిల్లీలో సంప్రదింపులు

### వెంకట్రావు లచ్చన్న ప్రయాణం: హైదరాబాదునుంచి రంగారెడ్డి

కర్నూలు, నవంబరు 28: ఇప్పుడే విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను వివరించడానికి ఆంధ్రప్రభుత్వం తరఫున కళా వెంకట్రావు, శ్రీ లచ్చన్న తెలంగాణా ప్రత్యేకరాష్ట్రాన్ని సృష్టించాల్సిన అవసరాన్ని నచ్చజెప్పడానికి, తెలంగాణావాదుల తరఫున కొండా వెంకట రంగారెడ్డిగారు ఢిల్లీకి ప్రయాణమైనారు.

శ్రీ వెంకట్రావు శ్రీ లచ్చన్న యీ రాత్రి బయలుదేరి వెడుతున్నారు. రంగారెడ్డిగారు, పార్లమెంటు సభ్యులైన హెచ్. సి. హెడాను వెంటబెట్టుకొని యీ ఉదయమే హైదరాబాదునుంచి వెళ్ళారు.

ఆంధ్ర శాసనసభ, విశాలాంధ్రను, తక్షణం ఏర్పాటుచేయాలని కోరుతూ, ఏకగ్రీవంగా తీర్మానించి ఉన్నందున, ఆ తీర్మానానుసారం వెంటనే తీసుకోవలసిందిగా, వెంకట్రావు, లచ్చన్నగారలు కేంద్రప్రభుత్వాన్ని, కాంగ్రెసు అధిష్ఠానవర్గాన్ని అర్థిస్తారు.

హైద్రాబాదు శాసన సభలో ఫజులాలీ సంఘ నివేదికపై ప్రభుత్వం ప్రతిపాదించదలచిన తీర్మానానికి సవరణ ప్రతిపాదించడానికి, అనుమతించవలసిందిగా రంగారెడ్డిగారు కాంగ్రెసు అధిష్ఠానవర్గాన్ని కోరుతారు. హైద్రాబాదు సంస్థానాన్ని విచ్ఛిన్నంచేసి, తెలంగాణా ప్రాంతాన్ని, హైద్రాబాదు రాజధానిగా ఒక ప్రత్యేక రాష్ట్రం చేయాలని, వీరు పెట్టబోయే సవరణ అంతరార్థం. తెలంగాణా ప్రాంతాన్ని ప్రక్కన ఉన్న ఆంధ్రతో కలిపివేయాలని కోరే అధికార తీర్మా...

### దాల్మియా చే 180 లక్షల చెల్లింపు

#### భారత భీమాసంస్థ వ్యవహారంలో

న్యూఢిల్లీ, నవంబరు 28: భారత్ ఇన్సూరెన్సుకంపెనీకి తిరిగి రూ. 180 లక్షలు ఐచ్ఛికంగా చెల్లిస్తానని సేఠ్ దాల్మియా ఇచ్చినమాటను భారతప్రభుత్వం ఆమోదించిందని, ఈ మొత్తాన్ని తయన ఆ కంపెనీ ఖాతాలకు అప్పుడే జమవేశారని, ఇంకా ఇటువంటి మొత్తాలే ఏమున్నా కన్పిస్తే చెల్లించడానికిగూడా సేఠ్ దాల్మియా ఒప్పుకున్నారని ఆర్థికమంత్రి నేడు లోకసభలో తెలియజేశారు.

సేఠ్ దాల్మియా వ్యవహారాలను గురించి ఇంకా పరిశోధన జరుగుతున్నదని, దాని ఫలితాలు తెలియగానే, అవసరమైన చర్యలను ప్రభుత్వం అవలంబిస్తుందనిగూడా ఆర్థికమంత్రి హామీ ఇచ్చారు.

### పాక్ ప్రధాని చైనా యాత్ర

#### వచ్చే ఏప్రెల్‌లో వెడుతున్నట్లు వార్త

కరాచీ, నవంబరు 28. చైనా ప్రధాన...

## సమష్టి కుటుంబంలో తండ్రికి హక్కు

### స్త్రీకి వారసవర్గ నిర్ణయం కోసం కాంగ్రెసు సంఘ చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 27. సమష్టి కుటుంబపు ఆస్తి విషయంలో వీలునామా వ్రాసేహక్కు తండ్రికి ఇవ్వటానికి కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ సవరణ సంఘం సుముఖత చూపినట్లు తెలిసింది.

వారసత్వపు బిల్లును చర్చించటానికి ...

### స్త్రీకి వారసులు

### కాంగ్రెసు కార్యదర్శితో శ్రీ అల్లూరి సంప్రదింపులు

### అబిసీనియాకు టిటో ప్రయాణం

బెల్గ్రేడ్, నవంబరు 27: యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, అబిసీనియా చక్రవర్తి ఆహ్వానంపై వచ్చే నెల ఆ దేశం వెడుతున్నారని, విదేశాంగ మంత్రిత్వశాఖ కృపపరచింది.

## రష్యాలో ఉదజని అస్త్రప్రయోగ ఫలం

### జపాన్ జర్మనీ దేశాలలో అసహజ వర్షాలు

లండన్, నవంబరు 27: రష్యాలో పేల్చిన ఉదజని బాంబు మూలంగా అటు జపానులో, ఇటు జర్మనీలో అణుక్రియాత్మకమైన వర్షము, రజోపాతము సంభవించాయి.

# ప్రకటన

తూర్పు గోదావరి జిల్లా వ్యాబలంక గ్రామంలో మా "ఆంధ్రపత్రిక" (దిన పత్రిక, సచిత్ర వారపత్రిక, భారతి మాసపత్రిక)లను స్వంత బాధ్యతపై విక్రయించుటకు ధరావతు చెల్లించగలిగిన న్యూస్ వెండర్ల నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. వివరములకు : మేనేజరు, ఆంధ్రపత్రిక, మద్రాసు-1

ఇప్పుడు: తాకట్టులు, లివలు లేకుండా వ్యక్తిగత హామీపై రు. 1,000/- వరకు ఇవ్వబడును. అనేకులు ఇప్పటికే పొందియున్నారు. ఇంగ్లీషులో వ్రాయండి Bombay Mercantile Co., Bombay-23.

"పోలీసు డిపార్టుమెంటు"

ఆంధ్ర.

వేలం నోటీసు

1-12-1955 తేది గురువారం ఉదయం 11 గంటలకు చిత్తూరు జిల్లా పోలీసు సూపరింటెండెంటు వారి ఆఫీసు ఆవరణలో బహిరంగ వేలములో 1942 మోడల్ ADC 861 పోలీసు వాన్ లారీ విక్రయింపబడును. వేలము వివరములు చిత్తూరు, జిల్లా పోలీసు సూపరింటెండెంటు వారినుండి తెలిసికొనవలెను.

ఎం. ఎల్. థామస్,
జిల్లా పోలీసు సూపరింటెండెంటు.
చిత్తూరు.

టెండరు నోటీసు

2-1-1956 సోమవారము సాయంత్రము రెండు గంటల వరకు బందరు, విజయవాడ, గుడివాడ, నూజివీడు, నందిగామ, మునగాల గవర్నమెంటు ఆసుపత్రులకు మరియు ప్రైమరి హెల్తు సెంటరు తిరువూరు 1956-1957 సంవత్సరమునకు (అనగా 1-4-56 నుంచి 31-3-1957 వరకు) కావలసిన ఆహార పదార్థములకు "సీల్డు టెండర్లు" ఆ ఆసుపత్రుల అధీనమునందు గల మెడికల్ ఆఫీసర్లుచే తీసికొనబడును. టెండర్లు పెట్టదలచినవారు అందుకు సంబంధించిన వరకులపై మెడికల్ ఆఫీసర్ల వద్దనుండి పొందవచ్చును.

బందరు, 14-11-55. } యస్. గోవిందరాజులు, జిల్లా మెడికల్ ఆఫీసరు.

టెండరు నోటీసు

మునిసిపల్ ఆఫీసు ఒంగోలు

క్రిందటింగు పనులు చేయుటకు గాను, సీల్డు టెండర్లు ఒంగోలు మునిసిపల్ కమీషనరుగారిచే, ఒంగోలు మునిసిపల్ ఆఫీసులో 10-12-55 తేదీ సాయంత్రం 4 గంటలవరకు తీసుకొనబడును. సదరు టెండర్లు ప్రింటెడు ఫారములో నుండవలెను. సదరు ఫారములు, ఒంగోలు మునిసిపల్ ఆఫీసు పనిచేయు వేళలలో అనగా ఉదయం 11 గంటలనుండి, సాయంత్రం 5 గంటలవరకు పొందవచ్చును. టెండర్లు 10-12-55 తేదీ సా॥ 4-30 గంటలకు తీయబడును. టెండరులో పాల్గొన దలచినవారు రు. 100/- ధరావత్తు చెల్లించి, రశీదును టెండరుతో పాటు జతపర్చవలెయును.

(సం) యస్. కె. రంగనాయకులు,
26-11-55. కమీషనరు.

మచిలీపట్నం మునిసిపాలిటీ
టెండరు నోటీసు

పనివారలకు కావలసిన ఈ దిగువ వుదహరించిన చెప్పులు, దుస్తులు మొదలగునవి కావలసిన గుడ్డకు సీలువేసిన టెండర్లు 12-12-55 తేదీ సాయంకాలము 3 గంటలవరకు మునిసిపల్ కమీషనరుగారిచే గాని, వారిచే అధికారమివ్వబడిన వారిచే గాని మునిసిపల్ ఆఫీసులో తీసుకొనబడును. ఆ దినమున నే సాయంకాలం 3-30 గంటలకు అచ్చట హాజరయిన టెండరుదార్ల యెదుట తెరువబడును. అర్జీదాఖలు చేసిన మీదట టెండరు షరతులు యివ్వబడును. ప్రతి టెండరుకు రు. 300-0-0 లు టెండరు డిపాజిట్టు చెల్లించవలెను. కాంట్రాక్టు కమిటీవారు గాని, కౌన్సిల్ వారు గాని సదరు టెండరు కారణములు చెప్పకయే అంగీకరించుట గాని నిరాకరించుటకు గాని అధికారము కలిగియున్నారు.

1. కోకీ కోటింగు నెం. 1/20 & 2/20 రు వెడల్పు 28" 100 గజములు
2. కోకీ షర్టింగు నెం. 1/20 & 2/20 రు వెడల్పు 28" 1272 గజములు
3. దోవతులు నెం. 40 రు x 7 x 45" 187 జతలు
4. కండువాలు నెం. 40రు x 5 x 40" 187 జతలు
5. గ్యారంటీ రంగు చీరెలు నెం. 40 రు x 7 x 45" 224
6. గ్యారంటీ రంగు జాకెటు గుడ్డ నెం. 40". 45" వెడల్పు 168 గజములు
7. చెప్పులు రబ్బరు సైజులో చేసినవి 598

(సం) జె. రామారావు,
26-11-55. కమీషనరు.



# రాష్ట్ర వార్తలు

## గుంటూరు

శ్రీ లక్ష్మీ చిత్రరచన లలితకళలపాఠశాల వార్షికోత్సవం యీ నెల 20 న జరిగింది. శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. శ్రీ జంధ్యాల సీతారామశాస్త్రి ప్రసంగిస్తూ పాఠశాల నిర్వాహకులు శ్రీ బ్రహ్మయ్య శాస్త్రి సామర్థ్యాలను ప్రతిభా విశేషాలను ప్రశంసించారు.

## సికిందరాబాదు

హిందీ ప్రేమీమండలి అధ్యక్షతన సూర్యాడీ హిందీ విద్యాలయంలో హిందీ ప్రచారకుల సమావేశం నవంబరు 18 న జరిగింది. శ్రీ యస్. సి. వెంకటాచార్యులు అధ్యక్షత వహించారు. శ్రీ రాధాకృష్ణజోషీ సికందరాబాదు నగరంలో హిందీ ప్రచార కార్యకలాపాలను అభివృద్ధిపరచుటకు అవసరమైన విషయాలనుగురించి ముచ్చటించారు. తరగతుల సంఖ్యను పెంచుటకు, కార్యకర్తలను ఎక్కువగా నియమించుటకు, నిర్ణయించారు.

## గద్వాల

చేనేత సహకారసంఘ సర్వసభ్య సమావేశం యీ నెల 20 న శ్రీ ఎ. సంగన్న అధ్యక్షతన జరిగింది. విదేశాలలో మన చేనేతవస్త్రాలకుగల గిరాకీ గురించి శ్రీ మహేంద్రకార్ వివరించారు. శ్రీ టి. నాగప్ప ప్రసంగించారు. అధ్యక్షులుగా శ్రీ అక్కలి నాగప్ప, కార్యదర్శిగా శ్రీ కె. బలరాం ఎన్నికైనారు.

## ఆకివీడు

నవంబరు 25 న ఇక్కడ ప్రభాకర హోమియో వైద్యశాలను స్థాపించారు. డాక్టరు అల్లూరి సుబ్బరాజు ప్రసంగించారు. వైద్యశాల సంస్థాపకులు శ్రీ పి. వి. రాజు పేదలకు వుచిత వైద్య సహాయం చేస్తామని చెప్పారు. శ్రీ నీలి రామారావు, శ్రీ కె. వి. నరసింహరాజు, ప్రసంగించారు. శ్రీ కట్టా వెంకన్న వందన సమర్పించారు.

## విశాఖ జిల్లా కిసాన్ సమ్మేళన్

### కొత్త పన్నులు వద్దని తీర్మానం

అనకాపల్లి, నవం 27: ఆంధ్రరాష్ట్ర కిసాన్ సమ్మేళన అధ్యక్షుడు గొట్టిపాటి వెంకటసుబ్బయ్య గారి అధ్యక్షతన 21 వ తేదీనాడు జిల్లా కిసాన్ సమ్మేళన సర్వసభ్య సమావేశం జరిగింది.

ఈదిగువ తీర్మానాలు సభలో ఆమోదించారు.

జమీ గ్రామాలలో, రైత్వారీ శిస్తు రేట్లు, శిస్తు తగ్గింపు చట్టం ప్రకారం అములు జరుపనంతవరకూ ఫసలీ జాస్తి అదనపు పన్నులు, తీరువజాస్తి, వసూలు చేయకుండా ఆపుచేయాలి.

జమీ గ్రామాలలో, చెరువులు వాగులు వగైరా జలాధారాలను మరమ్మతు చేయించాలి.

శిస్తువసూలు విషయంలో 18 నెంబరు రశీదు ఫారములు రాష్ట్రమంతటా ఒకేవిధంగా ఉండేట్లు చూడాలి.

తుమ్మలపాల పంచదార ఫ్యాక్టరీకి చెరకు పంటభూమి నిర్ణయం, రైతులకు నష్టదాయకంగా ఉన్నది, కాబట్టి ఆ నిర్ణయాన్ని పునరాలోచించాలి."

అనంతరం జిల్లా కిసాన్ సమ్మేళన మునకు యీ దిగువ సంఘాన్ని ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు: వి. వి. రమణ; ఉపాధ్యక్షులు: ఈటి నాగయ్య పప్పలనాయుడు; ప్రధాన కార్యదర్శి: తోటకొండ నర్సింగరావు; సహాయ కార్యదర్శి: తాడికొండ నరసింగరావు; సభ్యులు: నాడపల్లి సూర్యనారాయణరాజు, రాపేటి రామానాయుడు, భీశెట్టి అప్పారావు, లోజంకి గంగయ్యనాయుడు, దబ్బీరు వెంకట సత్యనారాయణ, లెక్కలపిడ సింహాచలం, సిర్గా కన్నయ్యనాయుడు, రాడ పెంటయ్యదొర, మజ్జి పైడయ్య నాయుడు, కనిరెడ్డి పాపయ్య, మజ్జి పోతురాజు, బింగంశెట్టి సత్యనారాయణ, ఆలు దశావతారం, నానగిరి పైడితల్లి, రెడ్డి వెంకట్రామయ్య, వజ్జుల నరసింహాచార్యులు, డి. ఎల్. ఎన్ రాజు, జి. గురుమూర్తి, ప్రగడ అప్పలనాయుడు, కిరవల్లి సింహాచలం, బొద్దేపు అచ్చం నాయుడు, వంజారిబాలం నాయుడు.

టెండరు నోటీసు

బాపట్ల తాలూకా పూండ్ల గ్రామ పంచాయతీ పీరియాలోని యీ క్రింద కనుపరిచిన పనులు చేయుటకు గాను సీలు వేసిన టెండర్లు రు 100 కి 10-0-0 డిపాజిట్ తో 9-12-55 తేదీ సాయంత్రం 4 గంటలకు లోపుగా ఆఫీసుకు పంపవలెయును. ఇతర వివరములు పంచాయతీ ఆఫీసు పనిచేయు కాలములో ప్రసిడెంటుగారిని అడిగితెలుసు కొనవలెయును.

(1) మత్తె ఆనందరావు ఇంటివద్దనుండి అప్పికట్ల కాల్వవరకు మెటలు చేయుట.

ఎస్టిమేటు మొత్తం రు 1450/-

(2) యాలవర్తి వెంకటేశ్వర్లు ఇంటివద్ద నుండి మాలపల్లి పాతినూతుల వరకు మెటలు చేయుట.

ఎస్టిమేటు మొత్తం రు 1450/-

జనల కేశవరామకృష్ణయ్య, ప్రెసిడెంటు.

# ఆకాశవాణి

బుధవారం నవంబరు 30

## విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగు వా 7-15 వినవలె 7-30 మద్రాస్ వలె 8 ఆంగ్ల వా

మ॥ 12-30 మా॥ పాఠశాల 1-వినవలె 1-30 ఎ వలె 1-40 హిందీ వా 1-50 తెలుగు వా 2 వినవలె 2-15 ఉ॥ పాఠశాల 4 ప్రా॥ పాఠశాల

సా॥ 5-30 పేరి సుబ్బారావు-వయొలిన్ 6 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం 7 తెలుగు వా 7-15 పురాణ కాలక్షేపం 7-30 గాన సుధ (రి) 7-45 హరిజన సంక్షేమము (ప్రసంగం) 8 రాలిన నక్షత్రము (నాటిక) చెకోవ్ రచనకు అనుసరణ-హైదరాబాద్ నుండి రిలె 8 30 జాతీయ కార్యక్రమం-రెండవ ప్రణాళిక క్రింద గృహవసతులు (ఆంగ్లమున ప్రసంగం) సర్దార్ స్వరన్ సింగ్ కేంద్ర ప్రభుత్వ గృహనిర్మాణ, సరఫరా శాఖల మంత్రి 8-50 విరామసంగీతం(రి) హిమాంశువిశ్వాస్ - వేణువు కుమార్ బీరేంద్రనారాయణ్ : వేణువు 9 ఆంగ్ల వా. 9-15 భజన్ (రి) 9-30 పేరి సుబ్బారావు-వయొలిన్, 10 ప్రసార సమాప్తి.

## మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 పి. ఎస్. కౌసల్య, కె. వి. కె. మణి, వీణ 8 రాధ జయలక్ష్మి (రి).

మ॥ 12-30 పాఠశాల (త) 1-30 (రి) 1-40 హిందీ వా. 1-50 (రి) 2 తమిళ వా. 2-10 వినవలె 2-15 పాఠశాల (త) 4-30 పాశ్చాత్యసంగీతం.

సా॥ 5-30 లలితగీతం 6 సంగీతపాఠం 6-15 ప్రాంతీయ వా. 6-25 సుందరి తంపి 7 భక్తిగీతాలు 7-15 తమిళ వా. 7-30 జంత్రసమ్మేళనం 7-45 తమిళ ప్రసంగం 8 బి. రాజంఅయ్యర్ 8-30 జాతీయ కార్యక్రమం (ఢిల్లీ) 8-50 వినవలె 9 పి. లీల 9-15 వి. పంజాండయ్య, వేణువు 9-45 వినవలె 10-30 ప్రసార సమాప్తి.

## మదరాసు (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 కృతి మణిమాల 7-30 ఎ వలె 8 ఆంగ్ల వా.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మా॥ పాఠశాల 1 (రి) 1-30 ఆంగ్ల వా. 1-40 (రి) 1-50 తెలుగు వా. 2 గోటువాద్యం 2-15 ఉ॥ పాఠశాలలకు 4 ప్రా॥ పాఠశాలలకు 4-30 ఎ వలె.

సా॥ 5-30 ఎ వలె 6 ఆంగ్ల వా. ప్రాంతీయ వా. 6-25 లలితగీతము 6-30 గ్రామ॥ కార్యక్రమం కొండపల్లి బొమ్మలు (ప్రసంగం) 7 తెలుగు వా. 7-15 పురాణ కాలక్షేపము 7-30 ఎ వలె 7-45 హరిజన సంక్షేమము (ప్రసంగం) 8 రాలిన నక్షత్రము (నాటిక) 8-30 పి. లీల 9 ఆంగ్ల వా. 9-15 మద్రాసులో ఈ వారం విశేషాలు 9-30 ఎ వలె 9-45 గానలహరి 10-30 ప్రసారసమాప్తి.

## హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ (రి) 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 గాత్ర సంగీతం 7-45 గీత్, ఘజల్ 8 ఆం. వా. 8-15 హిందీ వా. 8-30 ఖయాల్.

మ॥ 12-30 మిలేజులేగానే (రి) 12-50 మరాటీ వా. 1 క్లారినెట్ (రి) 1-10 ప్రణయాంజలి (రి) 1-50 తెలుగు వా. 3-45 పాఠశాల (రి).

సా॥ 5-30 ఖయాల్ 5-45 ఖయాల్ 6 కన్నడమున కార్యక్రమం 6-30 గ్యానమంజరి (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ జానపద గీతాలు 7 తెలుగువా. 7-15 గ్రామసీమ సమీప గ్రామమునుండి (వినోద కార్యక్రమం) 7-45 కన్నడ వా. 8 రాలిన నక్షత్రము (నాటిక) 8-30 జాతీయ కార్యక్రమం 8-50 ఘజల్ 9 ఆం. వా. 9-15 ఉర్దు వా. 9-30 కాళిదాస టాగూర్ రచనలలో ప్రకృతివర్ణన (ప్రసంగం) 9-45 టి. కె. సుబ్రహ్మణ్యపిళ్ళె నాదస్వరం (రి) 10-30 ప్రసార సమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 28:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 66-0-0
ఫిట్టాబంగారం తులం రు. 98-13-0
మేలిమి బంగారు రు. 96-8-0
సీసువెండి తులం100కి రెడి రు. 178-0-0
చిల్లర ధర రు. 1-13-0

## పెరుకు

(561 పా॥ 1-కి ఎక్సైజ్ సుంకంతో సహా మెకిన్ సేల్సుటాక్సుతో సహా)

డిసెంబరు రు. 104-0-0

పెరుకినగనూనె ఎక్సుపెల్లర్ బిలో 8% 500పా.) రెడిచిల్లరధర 220-0-0

డిసెంబరు రు. 220-0-0

197 పెంకాయనూనె (37½ పౌనులు సేల్సుటాక్సు అదనం

అంబుమార్కు రు. 24-0-9
ఎం. ఎస్. బ్రాండ్ దబ్బా 24-4-9
రాజా రు. 23-12-9

## ఆముదం

తిరుపతిస్వారు (500 పా.) రు. 185-0-0

## పంచదార

బ్రిటిష్ షుగరు (2 క్యాట్స్)

85-4-9-85-6-9

సైజాను (228 క్యాట్స్)

86-0-9

సౌమ్య కోట (2 క్యాట్)

85-4-9

# క్రీడారంగం

## ఆంధ్ర యూనివర్సిటీ ఫుట్ బాల్

### 'డి' జోన్ లో ఉస్మానియా గెలుపు

కర్నూలు, నవంబరు 28 : ఇక్కడ ఆంధ్రా యూనివర్సిటీ 'డి' జోన్ ఫుట్ బాల్ పోటీలలో కర్నూలు ఉస్మానియా కాలేజి 28 వ తేదీన ఫైనల్సులో అనంతపురం ఆర్ట్సు కాలేజిని 2 గోలులతో ఓడించింది. (2-0) అనంతపురం కాలేజి కిందటి సం॥ హోల్డరు.

మొదటి సగంలో అనంతపురం జట్టు ఒకసారి గోలు చేయబోగా, ఉస్మానియా గోలరూ, రాష్ట్ర జట్టు సభ్యుడూ అయిన అబ్దుల్ రసూల్ చాలా నేర్పుతో అడ్డగించాడు. రెండవసగంలో రెండు గోలులను కర్నూలు రైట్ ఇన్ హబీబుల్లా చేశాడు. ఆతరవాత అనంతపురంజట్టు ఎన్నోసార్లు కర్నూలు గోలుమీద దాడిచేసిందికాని, రసూలు వాటిని విఫలంచేశాడు. అనంతపురం జట్టులో జాకబ్ బాగా ఆడాడు.

తొలిపోటీలలో నెల్లూరు వి. ఆర్. కాలేజి కడప ఆర్ట్సుకాలేజీని, (5-0), ఉస్మానియా కాలేజి మదనపల్లి కాలేజీని (5-0) ఓడించినవి. సెమిఫైనల్సులో అనంతపురం కాలేజి నెల్లూరు కాలేజీని (2-0), ఉస్మానియా కాలేజి తిరుపతి వెంకటేశ్వర కాలేజీని (4-0) ఓడించినవి.

వాలీబాల్ ఫైనల్సులో కావలి కాలేజి ఉస్మానియా కాలేజిని ఓడించింది (15-5, 15-6).

కబాడీ ఫైనల్సులో కావలి కాలేజి కడప కాలేజిని ఓడించింది (15-7).

(స్వ. వి.)

## డ్యూరాండ్ ఫుట్ బాల్

న్యూఢిల్లీ, నవంబరు 27 : నేడిక్కడ మునిసిపల్ స్టేడియంలో డ్యూరాండ్ కప్ ఫుట్ బాల్ ఫైనల్సులో ఇండియన్ ఏర్ ఫోర్స్ జట్టు మద్రాసు రెజిమెంటల్ సెంటర్ తో మళ్ళీ డ్రా చేసింది. ఎవ్వరూ గోలు చేయలేదు.

## ప్రాంతీయ పోటీలు

ధర్మవరం తాలూకా భారత్ సేవక్ సమాజ్ ఉపసంఘం జనవరి మూడో తేదీనుంచి దక్షిణ భారత బాడ్మింటన్ పోటీలనూ, అనంతపురం జిల్లా టెన్నిస్ పోటీలనూ, గ్రామీణ వినోద కార్యక్రమ పోటీలను ధర్మవరం తాలూకా కుమ్మా జరపటానికి నిశ్చయించింది.

పశ్చిమ గోదావరిజిల్లా అత్తిలిలో డిసెంబర్ 20 నుంచి 23 వరకూ డా॥ రెంటాల మానుమంత రావు మెమోరియల్ చెడుగుడు పోటీలు జరుగుతవని నిర్వాహకుడు అల్లంపల్లి చంద్రరావు తెలియజేస్తున్నారు.

## భీమవరంలో తారు రోడ్లు

భీమవరం, నవంబరు 22: భీమవరం-నర్సాపురం రోడ్డును తారురోడ్డుగా మార్చేందుకు రహదార్లశాఖ అంచనా వేసిన ఖర్చులోసగం అనగా రు. 14700 భరించటానికి పురపాలకసంఘం తీర్మానించింది. శివరావుపేట స్టేషనులో విద్యుద్దీపాలు, మంచినీటి సౌకర్యాలు కలిగించాలని రైల్వే అధికారులను కోరింది.

అంతకుముందు జరిగిన మరో సమావేశంలో పట్టణంలో అగ్నిమాపక దళం నెలకొల్పాలని ప్రభుత్వాన్ని కోరారు. సూపర్ వైజరు సూచించినపనుల అములుకు రు. 5వేలు మంజూరు చేశారు.

## యలమంచిలి తాలూకా గ్రామోద్యోగుల జీతాలు

యలమంచిలి, నవంబరు 22: తాలూకా గ్రామోద్యోగీయ సంఘ 17-వ వార్షికోత్సవం శ్రీ చిన్నకోట సత్యనారాయణ అధ్యక్షతన జరిగింది. శ్రీ చిక్కాల రామారావు స్వాగతమిచ్చారు. శ్రీయుతులు కాశీరాజు బుచ్చిరాజు, గుళ్ళపల్లి వెంకయ్య, మంతెన నారాయణరావు, మంధా భీమన్న వుపన్యసించారు.

తాలూకా కేంద్రానికి 20 మైళ్ళ దూరంమించి వున్న గ్రామాల అధికారుల జీతాలు మనియార్డరు ద్వారా పంపాలని, గ్రామాధికారులు తాలూకా కార్యాలయానికి వచ్చినపుడు ప్రయాణబత్తెము లివ్వాలనీ, వి ఫారములు వగయిరా త్వరగా సరఫరా చేయాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు.

## చీరలకొచ్చిన ప్రమాదం

లక్నో, నవంబరు 27: గడ్డినికోసే యంత్రం ఒకటి నేడు ఒకనడివయస్సు యువతి కంఠాన్ని అమాంతం నరికి వేసింది.

విద్యుచ్ఛక్తి సహాయంతో నడిచే ఈ యంత్రంలో యీమె తనగడ్డిని కోయించుకుందామని దాని ప్రక్కనే నిలబడింది. దురదృష్టవశాత్తు ఆమెచీర ఆ యంత్రంలో ఎలాగో చిక్కుబడిపోయింది. వెంటనే ఆయంత్రం ఆమెను బరబరా వధ్యస్థానికి లాగివేసి కంఠాన్ని తక్షణమే నరికివేసింది. ఆమె ఎవరో నుస్తు తెలియలేదు. దర్యాప్తు చేస్తున్నారు.

# ఆరు కేంద్రాలలో అంబర్ చర్ఖాలు

## జనవరి నుంచి

### చేనేత వారితో సంప్రదింపులు

నిడుబ్రోలు, నవంబరు 19 : 1956 జనవరి 1 వ తేదీనుండి చీరాల, మంగళగిరి, సర్వేపల్లి, ఏలూరు, నారాయణవనం, ఎమ్మిగనూరు చేనేత కేంద్రాలలో "అంబర్ చరఖా" కేంద్రాలు స్థాపించాలని నిర్ణయించినట్లు తెలుస్తున్నది. ఈ ఉదయం అఖిల భారత ఖాదీ, గ్రామపరిశ్రమల సంస్థ డైరెక్టరు శ్రీ కె. ఎ. వెంకట్రామయ్య, డిప్యూటీ డైరెక్టరు శ్రీ పి. వి. రాఘవన్ విజయవాడలో చేనేత కాంగ్రెస్ ప్రతినిధులతో ఈ అంబర్ చరఖా కేంద్రాల స్థాపన విషయమై చర్చించారు. ఈచర్చలలో శ్రీయుతులు దామర్ల రమాకాంతరావు, ప్రగడకోటయ్య, కొసిన బసవరాజు, తిరువీధుల రామకృష్ణ, సార్ని రాజవీరయ్య, అక్కల కోటయ్య, భట్టా కుమారస్వామి, నీలిరామారావు పాల్గొన్నారు.

ఒక్కొక్క కేంద్రంలో 60 అంబర్ చరఖాలను ఏర్పాటు చేస్తారు. వీటిని 3 మాసాలపాటు సాగిస్తారు. 120 మంది వడుకు పనివారలను తీసుకొంటారు. శిక్షణ యివ్వటానికి నలుగురు సూపర్ వైజర్లుంటారు. వడుకు పనివారలకు వడికిన ప్రతిచిలపకు యిచ్చే 2 అణాలు కాక మొదటినెలలో రోజుకు 8 అణాలు, రెండవనెలలో రోజుకు 6 అణాలు, 3 వ నెలలో రోజుకు 4 అణాలు చొప్పున విరాళం యిస్తారు. ఈ కేంద్రాలలో తయారైన నూలును స్థానిక చేనేత సహకార సంఘాలలో వుపయోగిస్తారు. ఈ కేంద్రాలు కొత్త ఖాదీ కేంద్రాలలో మరొక ఆరింటిని కూడా స్థాపించగలరని తెలుస్తున్నది.

ఈ మూడు నెలల్లో ఒక్కొక్క కేంద్రంలో 2250 పౌనుల నూలు తయారుకాగలదని, తద్వారా 9 వేల గజాల వస్త్రము తయారు కాగలదని అంచనా వేశారు.

## లింగారెడ్డిపాలెం మునసబుకు శిక్ష

### ప్రభుత్వద్రవ్యం వాడుకొన్నాడని

బందరు, నవంబరు 23: దివితాలూకా లింగారెడ్డి గ్రామ మునసబు మహమ్మద్ జఫార్ ఖాను ప్రభుత్వం తాలూకు శిస్తు డబ్బు, వ్యవసాయశాఖ ఋణాలబాపతు సొమ్మును వసూలుచేసి దుర్వినియోగం చేశాడని బందరు అడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు, ముద్దాయికి కోర్టులేచువరకు ఖైదు, రూ 200 జరిమానా విధించి, అది కట్టకపోతే 3 మాసములు ఖైదు అనుభవించాలని లోగడ తీర్పుఇచ్చారు.

ముద్దాయి అశిక్షలపై జిల్లా సెషన్సు జడ్జివద్ద అప్పీళ్లు దాఖలు చేసుకోనగా సెషన్సుజడ్జి, యస్. ఓబుల రెడ్డిగారు ఉభయపార్టీల వాదనలను విని, మేజస్ట్రేటు తేలికగా శిక్షలు విధించారని చెప్పుతూ అప్పీళ్ళను త్రోసివేశారు.

అప్పీలుదారు తరఫున కె. లక్ష్మణరావుగారు, ప్రాసిక్యూషన్ తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటరు కె. పి. మల్లికార్జునుడు గారు వాదించారు. (స్వ. వి.)

## ఉమ్మెత్త విషమిచ్చి నందుకు 4 ఏళ్ల శిక్ష

బందరు, నవంబరు 23 :

బాపట్లతాలూకామామిళ్లపల్లి గ్రామస్థుడు యీ పూరి పెద్దిరెడ్డి అనునతను కృష్ణాజిల్లా నందిగామ తాలూకా మానుమంతి పాలెం కాపురస్తులు చిరుమామిళ్ళ వెంకయ్య, ముండ వెంకటరత్నం అనువారలకు ఉమ్మెత్త విషము లడ్డులలో కలిపియిచ్చి, వారివద్ద వున్న రూ 32 రొక్కము అపహరించి నేరం చేసినందుకు కృష్ణాజిల్లా సెషన్సు జడ్జి ఓబులరెడ్డిగారు 328 సెక్షన్ క్రింద 4 సం॥ ములు 379 సెక్షన్ క్రింద 2 సం॥ ములు కఠినఖైదు విధించారు. రెండు శిక్షలు ఏకకాలములో అనుభవించాలని కూడా తీర్పులో చెప్పారు.

ప్రాసిక్యూషన్ కథనము:— చిరుమామిళ్ళ వెంకయ్య, అతని నౌకరు ముండ వెంకటరత్నం మంగళగిరిలో గోసకాయలు అమ్ముటకు రెండెడ్లబండితో వెళ్లి, సరుకు అమ్ముకొని తిరుగు ప్రయాణమవుతూండగా, ముద్దాయి పరిచాలకు చెందిన ఆట్లూరి వెంకటేశ్వర్లు అనే రైతునని నమ్మించి, వారితో బెజవాడకువచ్చాడు. బండి బాడుగకొరకు ప్రయత్నించి విఫలుడై, నందిగామకు వాళ్ల బండిపైనే ప్రయాణమునకట్టే తానే బండినిలోలుతూ అడ్డరోడ్డువద్దకు రాగానే బాగా చీకటిపడింది. ముద్దాయి లడ్డులు బూందిని వారికి యిచ్చారు. వారు తిన్నారు. తరువాత వారికి మగతకల్గి దాహము అయింది. సమీపములోని యింటికివెళ్లి దాహము తీర్చుకొని వచ్చేలోపల ముద్దాయి వెంకయ్య ఒట్టలో కట్టబడిన రూ 32 రొక్కము కాజేసి పరారి అయినాడు. కర్నూలు సి. ఐ. డి. బ్రాంచి పోలీసులు ముద్దాయిపై చార్జీషీటు దాఖలుచేశారు. ప్రాసిక్యూషను తరఫున 24 గురు సాక్షులను విచారించారు. ముద్దాయితరఫు సాక్షులు లేరు. ముద్దాయి నేరము చేయలేదని వాదించారు. అసెసర్లందరు ముద్దాయి నేరస్థుడని అభిప్రాయమిచ్చారు. జడ్జి ముద్దాయి నేరము చేశాడని నిర్ణయించి పైవిధముగా శిక్షలు విధించారు. ప్రాసిక్యూషన్ తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటరు కె. పి. మల్లికార్జునుడుగారున్నూ, ముద్దాయి తరఫున ప్రభుత్వం నియమించిన, బొప్పన రామలింగేశ్వరరావు వాదించారు.

# తూర్పు గోదావరిలో 2144 ఎకరాలు

## భూదానంగా లభ్యం

రాజోలు, నవంబరు 22 : వినోబాజీ భూదానయాత్రలో తూర్పు గోదావరి జిల్లాలో మొత్తం 2144 ఎకరాలభూమి విరాళం వసూలయింది. రాజోలు తాలూకాలో 27 గురు దాతలు 171 ఎకరాలు విరాళమిచ్చారు.

తూర్పు గోదావరిజిల్లా భూదాన యాత్ర చివరిరోజున (ఈ నెల 22) ఆచార్య వినోబా భావే ఆక్కడికి వచ్చారు.

వర్షం కురుస్తున్నా ప్రశాంతంగా సభ జరిగింది. మారణాయుధాలతో ప్రపంచశాంతినిసాధించలేమని గ్రహించటంవల్లనే రష్యా ప్రధాని బులానిన్ భారతదేశ పర్యటనకు వచ్చారనీ, శాసనాల ద్వారా కాక ప్రేమద్వారా మాత్రమే భూమి సమస్యలను పరిష్కరించగలమని ఆచార్యభావే ప్రబోధించారు.

జిల్లాకాంగ్రెసు తరఫున శ్రీయుతులు పట్టాభి రామారావు, మంతెన సుబ్బరాజు, పెన్మెత్స సత్యనారాయణ రాజుగారలు ఆచార్యభావేకు వీడ్కోలు ఇచ్చారు.

## చంద్రగిరి తాలూకా కాంగ్రెసు కార్యవర్గం

చిత్తూరు, నవంబరు 21: చంద్రగిరి తాలూకా కాంగ్రెసు సంఘ కార్యవర్గానికి యీ క్రిందివారు ఏకగ్రీవంగా ఎన్నికైనారు. శ్రీ టి. సి. విశ్వనాథం నాయుడు-అధ్యక్షులు, శ్రీ రాఘవులు నాయుడు-ఉపాధ్యక్షులు, శ్రీ టి. శ్రీరాములు శెట్టి-ప్రధానకార్యదర్శి, శ్రీ వి. జి. నరసింహులునాయుడు-సహాయ కార్యదర్శి. శ్రీయుతులు కె. ఆర్. కుప్పుస్వామి అయ్యంగార్, సి. ఆర్. అణాచలనాయకరు, టి. రామకృష్ణారెడ్డి, ఎ. చెంచురెడ్డి, టి. మునిరెడ్డి, డి. చిన్నబ్బనాయుడు, డి. ఎల్లప్ప నాయుడు, సభ్యులు.

## తిరుపతిలో క్షయ టీకాలకు సుముఖులు లేరు

తిరుపతి, నవంబరు 25 : క్షయ నిరోధక టీకాల ఉద్యమం వారం రోజుల క్రితం ప్రారంభమైనది. పిల్లల తల్లి దండ్రుల లిఖిత అనుమతిపైనే టీకాలు వేయవలసిందిగా పాఠశాలల ప్రధానోపాధ్యాయులు వైద్యులకు చెప్పారు. కాని పిల్లల తలిదండ్రులెవరూ సుముఖంగా లేరు. (స్వ. వి.)

## భీమవరం తాలూకాలో వరి పోటీలు

భీమవరం, నవంబరు 23: తాలూకా వరిపంట పోటీలో గెలుపొందినవారికి బహుమతులు ప్రదానంచేయుటకు సభ ఏర్పాటుచేశారు. ఆర్. డి. ఒ. శ్రీ పి. సుబ్బయ్యచెట్టి అధ్యక్షత వహించారు. జిల్లావ్యవసాయ శాఖాధికారి శ్రీ డి. హనుమంతరావు సభను ప్రారంభిస్తూ జపాను వరిసాగు ఆవశ్యకతను వివరించారు.

ఎకరానికి 6780 పౌనులు శ్రీయుతులు కొత్తపల్లి వెంకటరాజు, ఉద్దరాజు బంగార్రాజులకు, చెరి 75 బహుకరించారు. ఫిర్కా బహుమతులు శ్రీయుతులు జి. ఆదినారాయణమూర్తి, వి. కె. డి. వి. సత్యనారాయణరాజులకు లభించింది. భీమవరం ఫిర్కా బహుమతి కొత్తపల్లి వెంకట్రాజు బంగార్రాజు, గారలు పంచుకొన్నారు.

శ్రీ యం. వి. భాస్కరరావు వందన సమర్పించారు.

## ఆంధ్రప్రాంతంలో పురావస్తు శాఖ

గుంటూరు, నవంబరు 21: పురావస్తు శాఖ అసిస్టెంటు సూపరింటెండెంటు కార్యాలయ స్థాయిని ప్రస్తుతం సూపరింటెండెంటు కార్యాలయ స్థాయికి పెంచారు. శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యం సూపరింటెండెంటుగా నియమితులైనారు. శ్రీ సుందరరాజన్ అసిస్టెంటు సూపరింటెండెంటుగా వ్యవహరిస్తారు. సూపరింటెండెంటు హోదా లభించిన మొదటి ఆంధ్రుడు శ్రీ సుబ్రహ్మణ్యం గారే.

## విద్యార్థి కాంగ్రెస్ మహాసభలు

నెల్లూరు, నవంబరు 22 : డిసెంబరు 15, 16, 17, తేదీలలో గుంటూరులో జరుగబోయే ప్రదేశ్ కాంగ్రెసు రాజకీయ మహాసభల సందర్భంలో విద్యార్థి కాంగ్రెసు మహాసభలు కూడ జరుగుతాయి. శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు అధ్యక్షతవహిస్తారనీ, శ్రీ వి. సి. రాయ్ ప్రారంభిస్తారనీ కన్వీనరు శ్రీ కె. రాధాకృష్ణారెడ్డి ప్రకటిస్తున్నారు. విద్యార్థి కాంగ్రెసు సభ్యత్వపు రసీదు పుస్తకాలను రుసుంతోసహా డిసెంబరు మొదటివారంలోగా విజయవాడలోని రాష్ట్రకాంగ్రెసు కార్యాలయానికి పంపవలసి వుంటుంది.

# విశాఖలో నేపాల్ రాజదంపతులు

## విమానాశ్రయంవద్ద ఘనస్వాగతం

విశాఖపట్టణం, నవంబరు 27: నేపాల్ రాజదంపతులు ఉదయం జంషెడ్పూరు నుండి ఢిల్లీ వెళుతూ, యీ విమానాశ్రయంలో కొంచెంసేపు ఆగి, పౌరుల స్వాగతం స్వీకరించారు.

పౌరులతరఫున జిల్లాకలెక్టరు శ్రీ కె. పి. ఎల్. గ్విన్, స్వాగతమిచ్చారు. పురపాలక సంఘాధ్యక్షుడు ఎ.వి. భానోజిరావు, వారిసతీమణి, రాజదంపతులకు పూలదండలు వేశారు.

హిందూస్థాన్ నౌకా పరిశ్రమ మేనేజింగ్ డైరెక్టరు గుప్తాగారిని, వారి సతీమణిని, నౌకా స్థావరం సేనాధిపతి ఆల్ఫ్రెడ్, వారి సతీమణిని, తిరకౌశిఖ్ను దళాధిపతి శార్దూలాసింగును, విశ్వవిద్యాలయ కళాశాల ప్రిన్సిపాల్ రంగధామరావుగారిని రేవుపరిపాలకులు సంజీవయ్యగారిని జిల్లా పోలీసు సూపరింటెండెంటు ఎం. ఎస్. నారాయణరావు గారిని రాజదంపతులకు పరిచయం చేశారు.

విమానాశ్రయంలో నే వారికి ఆల్పాహారవిందు చేశారు. రాజదంపతుల వెంట, నేపాల్ లోని భారత రాయబారి శ్రీ భగవాన్ సాహెబ్ గూడా ఉన్నారు.

## పాక్ కాశ్మీర్ నుంచి వలస

శ్రీనగర్, నవంబరు 27 : పాకిస్థాన్ ఆక్రమణక్రింద ఉన్న, అజాద్ కాశ్మీర్ నుంచి 27 కుటుంబాలు, యుద్ధవిరమణ హద్దుదాటి, టీ త్వార్ ప్రాంతం వద్ద కాశ్మీర్ లో ప్రవేశించారు. చినిగిన వస్త్రాలు, వళ్లంతా గాయాలతో, వాళ్లస్థితి హృదయ విదారకంగా ఉన్నది.

కాశ్మీర్ ప్రధానమంత్రి బక్షిగులాం మహమ్మద్, పరామర్శించి, వారి ముఖతా, అజాద్ కాశ్మీర్ లోని దుర్భరజీవిత జరిస్థితులు సాకల్యంగావిన్నారు.

బహిరంగసభలో, అజాద్ కాశ్మీర్ లోని పరిస్థితులెంత దుస్సహంగా ఉన్నదీ, ఆ కాందిశీకులు వివరించారు.

## ప్రసూతికేంద్రం స్థాపన

తెనాలి, నవంబరు 22: తెనాలి తాలూకా సిరువలి గ్రామంలో నిన్న సాయంకాలం శ్రీమతి కందా మాణిక్యాంబ ప్రసూతికేంద్రానికి ప్రారంభం చేశారు. శ్రీ కందా భీమశంకరం అధ్యక్షతను బహిరంగసభ జరిగినది. శ్రీమతి కొండా పార్వతిమ్మ, శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మ ఉపన్యసించారు. పంచాయతిబోర్డు అధ్యక్షులు శ్రీజొన్న మాటి ఆదినారాయణ వందన సమర్పణ చేశారు.

## తూర్పుగోదావరి కిసాన్ సమ్మేళనం

రాజమండ్రి, నవంబరు 27 : తూర్పు గోదావరిజిల్లా కిసాన్ సమ్మేళన్ సభ్యులు, యీనెల 22 వ తేదీన, విక్రమహాలులో, రాష్ట్రకిసాన్ సమ్మేళన్ అధ్యక్షులగు గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతన సమావేశమై, యీ దిగువ వారిని కార్యనిర్వాహకవర్గంగా ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు : గోకిన చంద్రరావు, ఉపాధ్యక్షులు : దండమూడి వెంకటరామారావు, వడ్డి ముత్యాలరావు, కార్యదర్శి : పెండ్యాల సత్యం, సహాయ కార్యదర్శులు : తివ్వల సూర్యారావు, అల్లక చినవీరభద్రం గారు, సభ్యులు : శ్రీయుతులు కోటగిరి కొండలరావు, వంగిరి రామిరెడ్డి, ఈదర కొండలరావు, చెరుకూరి వీర్రాజు, వంగేటి వెంకటరత్నం, పోకల సత్యం జెట్టి చేటి సూర్యనారాయణ, మారంపూడి సీతారామయ్య, పాలపర్తి అబ్బులు, కొండపల్లి రామకృష్ణ, మొగలికుకల వీరన్న గారలు.

ఈనెల 16 వ తేదీన తూర్పు గోదావరిజిల్లా పొగాకు వర్తకుల ఉత్పత్తిదారుల సభలో చేసిన తీర్మానాలను ఆమోదించారు.

## కన్నడ సత్యాగ్రహం

బళ్లారి, నవంబరు 27 : అఖండ కర్నాటక రాజ్యనిర్మాణ పరిషత్తుకు చెందిన మరి 66 మంది నేడు అరెస్టు చేయబడినారు. వీరు కంప్లీ దగ్గర మైనారు కాలవనీటిని మరలించ ప్రయత్నించారు. వీరితో ఇప్పటికి అరెస్టుఅయిన వారి మొత్తం 429.

# బిట్రగుంట రైలుపై దౌర్జన్యం

## చీరాలవిద్యార్థులచర్య

(స్వకీయ విలేఖరి)

చీరాల, నవంబరు 25: నిన్న సాయంకాలము కాకినాడనుంచి బిట్రగుంటకు పోవు రైలుమీద చీరాల విద్యార్థులు స్టూవర్టుపురం స్టేషను సమీపములో రైళ్లలోని అలారం గొలుసులులాగి రైలుపెట్టెలమీద రాళ్లువిసిరి దౌర్జన్య చర్యలు జరిపారు.

రైలు గార్డు, డ్రైవరు చీరాలస్టేషన్ మాష్టరుకు యిచ్చిన ఫిర్యాదు ననుసరించి యీ క్రింది విషయాలు తెలిసినవి.

బాపట్లలో జిల్లా ఆటలపోటీలు చూచి షుమారు 200 మంది విద్యార్థులు టిక్కెట్లు లేకుండానే ఆ స్టేషనులో రైలుఎక్కారు రైలు బాపట్ల స్టేషను దాటుతుండగా అలారంగొలుసు లాగి రైలును ఆపారు. అప్పుడు మరి కొందరు విద్యార్థులు రైలుఎక్కారు. ఆతర్వాత మళ్లీ రైలు స్టూవర్టుపురం దాపులో 2 సార్లు అలారం గొలుసును లాగి బండిఆపారు. గొలుసులాగినవిద్యార్థిని ఒకరిని గార్డు పట్టుకొని రైలులో ప్రయాణము చేయుచున్న రైల్వేపోలీసు కానిస్టేబులుకు ఒప్పచెప్పారు. అంత ఆ ఖైదీని వదలివేయమని తక్కిన వాళ్లు కోరారు. కాని అందుకు ఒప్పుకోకపోవడంతో వారందరు వచ్చిన రైలు పెట్టెలకు యున్న వ్యాక్యూంగొట్టాలను తీసివేసి రైలు పెట్టెలమీద, రాళ్లుతీసి విసరడం సాగించారు.

ప్రయాణీకులలో కొందరికి స్వల్ప దెబ్బలు తగిలాయి కొందరు స్త్రీలు భయకంపితులై పసిపాపలతో బల్లల క్రింద దాగుకొన్నారు. కిటికీల అద్దాలు పగిలి ముక్కలైనవి. అల్లరి సద్దుమణిగిన తర్వాత రైలు స్టూవర్టుపురం నుండి చీరాలకు (5 మైలు) ఆలస్యంగా వచ్చినది. వ్యాక్యూం తీసివేసినందున 1 గంట సేపు పట్టింది. అలారం గొలుసు లాగిన వాళ్లని ఒంగోలు రైల్వేస్టేషనుకు తీసుకొని వెళ్లారు. రైలు స్టూవర్టుపురం స్టేషనువద్ద 66 నిమిషములు చీరాలవద్ద 20 నిమిషములు అనవసరముగా నిలిచిపోయింది. చీరాల రైల్వే స్టేషను మాస్టరు ఈ సంఘటన గురించి రైల్వే అధికారులకు యిచటి పోలీసులకు ఒంగోలు రైల్వే పోలీసులకు రిపోర్టు చేశారు. ఈ విషయం పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.

## హాస్టల్ శెలవు

మద్రాసు, నవంబరు 28 : గురునానక్ జయంతి అవడంచేత, రేపు, అంతి రిపాలా కార్యాలయాలకు శెలవు. రిజిస్టరుకాని ఉత్తరాలు, బంగీలు, ఒక్కసారి మాత్రమే బట్వాడా అవుతవి.

## ఉరవకొండకు అభివృద్ధి పథకావశ్యకత

ఉరవకొండ, నవంబరు 30: ఉరవకొండ సబ్ తాలూకాను సత్వరాభివృద్ధి పథకంక్రింద చేర్చాలని ప్రభుత్వాన్ని కోరుతూ తాలూకా కాంగ్రెసు కార్యవర్గం మొన్న తీర్మానించింది. శ్రీ బంగారు రామిరెడ్డి అధ్యక్షత వహించారు. రాజకీయ బాధితులకు జిల్లా కలెక్టరుకేటాయించిన భూములుసాగుకు లాయకు కావని, లాభదాయకం కావని మరో తీర్మానంలో తెలిపారు. శేత భూములు కోరుకో పేరున్నా కేటాయించుకు విచారం కల్గించారు. పాల్తూరులో పోలీసు స్టేషన్ నెలకొల్పి దొంగతనాలు నిరోధించాలని కోరారు.

## కీ॥ శే॥ శ్రీ పెన్మెత్స బాపిరాజు

భీమవరం, నవంబరు 26 : పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు మాజీ అధ్యక్షుడు, సహకారోద్యమ ప్రముఖుడు అయిన శ్రీ పెన్మెత్స బాపిరాజు తమ 80 వ ఏట మొన్న ఉదయం స్వర్గస్థులైనారు. (స్వ. వి.)





## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ కార్తిక శు॥ పూర్ణిమ 1955- సం॥ నవంబరు 29 మంగళవారం. మం॥ పూర్ణిమ 22-18 కృత్తిక 16-47 శే వర్జ్యం 7-33 ల.

బు॥ ప్రథమ నవంబరు 30 బుధవారం బు॥ ప్రథమ 18-41 రోహి-18-57 వర్జ్యం 6-55 ల 8-59 వ.

ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబునకగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్ (మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ కార్తిక శు॥ పూర్ణిమ మంగళవారం

## శాసనసభ సముచిత నిర్ణయం

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగే సమయంలోనే విశాలాంధ్రను ఏర్పరచాలని ఆంధ్ర శాసనసభ ఏకగ్రీవంగా తీర్మానించినది. విశాలాంధ్ర న్యాయస్థానము, విశాలాంధ్ర ప్రభుత్వ కార్యస్థానము హైదరాబాదులో వుంటుందని ఈ తీర్మానం స్పష్టం చేసింది. తెలంగాణా జిల్లాలు విశాలాంధ్రలోని ఇతర ప్రాంతాలతో సమంగా అభివృద్ధి చెందడానికి ఇప్పటి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల ప్రజలు సమష్టిగా కృషి చేయగలరని ఆంధ్ర శాసనసభ ఆమోదించిన తీర్మానం స్పష్టం చేసింది. ఈ తీర్మానం చాలా ముఖ్యమైనదే. తీర్మానంకంటే ముఖ్యమైనవి, సభ్యుల ప్రసంగాలు. భవిష్యత్తును గురించి భయాలు, అనుమానాలు ఎంతటివారికైనా వుండటం సహజమే. ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారుకూడా హైదరాబాద్ రాజధానిగా ఏర్పడే విశాలాంధ్రకే తాము సుముఖులమని, హైదరాబాద్ విశాలాంధ్రకు రాజధానిగా ఏర్పడే అవకాశం లేనప్పుడు, విశాలాంధ్ర అవసరంలేదని చెప్పవలసివచ్చింది. ఆంధ్ర శాసనసభ కార్యక్రమాన్ని నిష్పాక్షిక దృష్టితో, దురభిమానాలు లేకుండా పరిశీలించితే తెలంగాణా నాయకులకు ఏ విషయంలోనూ భయసందేహాలు వుండవు.

కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలను అంతవరకూ దూషించిన ప్రాంతం ఎంతగా లాభించిందో, ఆంధ్ర ప్రభుత్వ విధానాల నిర్ణయంలో ఏ ప్రాంతంవారి మాటలకు చెల్లుబడి వుంటున్నదో తెలంగాణా నాయకులు గమనిస్తే, హైదరాబాదు రాజధానిగా ఏర్పడే విశాలాంధ్ర ఎవరికి ఎక్కువ ప్రయోజనకరంగా వుంటుందో గ్రహించగలరు. ఎనిమిది తెలంగాణా జిల్లాలతో "స్వయంపోషకమైన" ఒక రాష్ట్రాన్ని స్థాపించటం సాధ్యమైతే, ఆంధ్రులకు రెండు రాష్ట్రాలేగాదు, అధికము అయిన రాష్ట్రాలైనా ఏర్పడవచ్చును. గుంటూరు, కృష్ణా, తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలు నాలుగు మిగులుజిల్లాలే. [illegible] ఈ నాలుగు జిల్లాలతో విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలను కలిపి గాని ఒక రాష్ట్రంగా ఏర్పరిస్తే మిగిలిన ఆంధ్రజిల్లాలతో ఏర్పడే రాష్ట్రపరిస్థితి ఎలా వుంటుందో వూహించుకోవచ్చును. విశాలాంధ్ర ఆంధ్రుల సర్వతోముఖ, సమగ్ర అభివృద్ధికి ఎంత అవసరమో హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ఆంధ్ర ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రి సహేతుకంగా నిరూపించారు. అయినా తెలంగాణా నాయకులు విశాలాంధ్రకు సుముఖులుకాలేదు. మంత్రి డాక్టరు చెన్నారెడ్డిగారు తాము కేంద్ర హోం మంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ సలహాను పాటించి ఫజులాలీ సంఘ ప్రతిపాదనలను యథాతథంగా అంగీకరిస్తున్నామని శాసనసభలో ప్రకటించారు. శ్రీ పంత్ తొలి ప్రకటనకు విరుద్ధంగా ప్రకటనలు చేయలేదు. ఆ ప్రకటనకు అనుబంధంగా ముఖ్యమైన ప్రకటనలు కొన్ని చేశారు. ప్రకటనలు చేయడమే గాక కాంగ్రెసు కార్యవర్గం నియమించిన ఉన్నతాధికార సంఘంలో సభ్యుడుగా హైదరాబాదు నాయకులకు ప్రత్యేకం సలహా ఇచ్చారు. పార్లమెంటులో ప్రజాభిప్రాయ సేకరణపై ప్రభుత్వ విధానం ఏమిటో స్పష్టంగా ప్రకటించారు. డాక్టరు చెన్నారెడ్డిగారు, వారితోబాటు తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా వుండాలని కోరుతూవున్న నాయకులు శ్రీ పంత్, కాంగ్రెస్ ఉన్నతాధికార సంఘం ఇచ్చిన సలహాలను పూర్తిగా పాటించాలిగదా? ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావుగారు ప్రతిపాదించనున్న తీర్మానానికి శ్రీ రంగారెడ్డి, శ్రీ చెన్నారెడ్డిగార్లు ప్రతిపాదించదలచిన సవరణ శ్రీ పంత్ పార్లమెంట్‌లో చేసిన ప్రకటన తరువాత అప్రస్తుతమవుతున్నది. శ్రీ రామకృష్ణరావుగారు ప్రతిపాదించే తీర్మానాన్ని హైదరాబాదు శాసనసభ అంగీకరించినప్పుడే విశాలాంధ్ర ఏర్పడుతుంది. ఆ తీర్మానాన్ని తిరస్కరిస్తే తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగానే వుంటుంది. అధికార తీర్మానానికి సవరణలను ప్రతిపాదించడానికి వీరికి అనుమతి ఇస్తే, సవరణకు వ్యతిరేకంగా వోటు చేసే స్వాతంత్ర్యాన్ని కాంగ్రెసు పక్షంలోని ఇతరసభ్యులు కోరవచ్చును. ఈ పరిస్థితులలో డాక్టరు చెన్నారెడ్డిగారి ఉద్యమం ఫలప్రదమయ్యే అవకాశం వుండదు. తెలంగాణా భవిష్యత్తును తెలంగాణానుంచి ఎన్నికైన శాసనసభాసభ్యులు నిర్ణయించడానికి కూడా తెలంగాణా రాష్ట్రనాయకులు సుముఖంగా లేరు. ఏ పద్ధతిని అవలంబించినా, ఏ సూత్రాన్ని అనుసరించినా ప్రస్తుత పరిస్థితులలో ప్రత్యేక తెలంగాణా రాష్ట్రోద్యమం సఫలం కాదు. అందుకు కారణం ఈ విషయాన్ని నిర్ణయించవలసిన వారందరూ ఆంధ్రులందరి అభివృద్ధికి విశాలాంధ్ర ఆవశ్యకతను గ్రహించటమే. తెలంగాణా రాష్ట్రనిర్మాణంకొరకు ఇంత పట్టుదలగా, ధైర్యంగా చివరవరకూ కృషి చేసిన డాక్టరు చెన్నారెడ్డి ప్రభృతులు విశాలాంధ్రలో కూడా అదే పట్టుదలతో కృషి చేసి విశాలాంధ్ర సంపదను తెలంగాణా జిల్లాల అభివృద్ధికి వినియోగపడేట్లు చేయగలరు. వారు ఆత్మవిశ్వాసంతో పని చేస్తున్నప్పుడు వారికి అనుమానాలుండవనవసరం లేదు.

# వేంకటాధ్వరి విశ్వగుణాదర్శము

## కర్ణాటదేశం - మధ్వాచార్యులు - మాధ్వులు -

విశ్వావసువు విమానం మరిఒక ప్రాంతానికి పోనిచ్చి కృశానునితో ఇలా అన్నాడు:

"పూర్వం కర్ణాటకదేశాన్ని గురించి విన్నాము. ఆదేశంఇప్పుడు కలకలలాడుతూమనకెదురుగా ప్రత్యక్షమౌతున్నది. ఆహా! ఈదేశ సౌందర్యం ఎంత చూచినా తనివి తీరడంలేదు! ప్రతి పట్టణంలోను చక్కని ఉద్యానవనాలున్నాయి. ప్రతి ఉద్యానవనంలోను పోకలు గెలలతో తులతూగుతున్నాయి. చెట్టు చెట్టుకీ, పువ్వు పువ్వుకీ తుమ్మెదలు ముమ్మరంగా సుమిగూడి, మకరందం ఆస్వాదిస్తూ మృదుమధురంగా గానంచేస్తున్నాయి. ఈ తుమ్మెదల ఝుంకారాలతోబాటు ఉద్యానాల్లో విహరించే మదవతుల మధురసల్లాపాలు కూడా వినవస్తూ హృదయాని కుల్లాసం కలిగిస్తున్నాయి."

కృశానునికీ మాటలేమీ నచ్చలేదు. అతడు తిరిగీ తనధోరణి మొదలు పెట్టాడు!

"పరమ పరమ తిట్టవలసిన దేశాన్ని పట్టుకుని భట్రాజులా పొగడుతున్నావేమిటి? ఈదేశంలో ఎక్కడచూసినా లింగబలిజ లనే పాషండులు ప్రత్యక్షమౌతారు. వీరికి వేదాలన్నా వైదికులన్నా పరమద్వేషం. ఒళ్ళంతా బూడిద పూసుకుని మెళ్ళో లింగాలు కట్టుకుంటారు."

"ఇంకా వీళ్లాచరించే దురాచారాలేకరువు పెడుతున్నాను విను! స్వయంగా ద్విజరాజైన చంద్రుడుతిన కిరణామృతంతో దేవదేవుని శిరస్సుమీద అభిషేకం చేస్తుంటాడు. అలాంటి దివ్య శిరస్సుమీద యీ లింగధారి శూద్రులు తమ పాదోదకాలతో అభిషేకాలు చేస్తారు." అతని దూషణకు విశ్వావసు ఈ విధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు:

"నీవిల్లాగ నిందించడం న్యాయం కాదు. ఈ దేశంలో తిరునారాయణపురంవంటి దివ్యక్షేత్రాలెన్నో ఉన్నాయి.

"యదుగిరిపై అవతరించిన శ్రీనారాయణస్వామిని మునీశ్వరులందరు నిర్మల హృదయాలలో ధ్యానిస్తుంటారు. ఈ స్వామి యదుగిరిపై నీలమేఘ రూపంతో సన్నిహితుడైవుండి, భక్తజనానికి నిత్యము హర్షం వర్షిస్తుంటాడు!

"యదుగిరి చరియపై అధివసించిన ఈస్వామి పాదపద్మాలు నిత్యము దేవేంద్రునికిరీట మణిమరకత కాంతులతో ధగధగ మెరుస్తుంటాయి. అకారణ కరుణాసాగరుడై నీలజలధర రూపంతో ప్రత్యక్షమైన శ్రీమన్నారాయణ స్వామికిదే నా నమస్కారము!

"పూర్వం కృష్ణావతారంలో యాదవ ఉగ్రసేనుని పూజలందుకొన్న యీస్వామి ఈనాడు యదుక్ష్మాధర (యదుగిరి) శిరస్సుపై పాదాలుంచడం చాలా ఆశ్చర్యకరంగా ఉన్నదిసుమా!

"పూర్వకాలంలో కృతయుగంలో గరుడాళ్వారు స్వయంగా శ్వేతద్వీపం నించి శ్వేతమృత్తిక సంపాదించి యీ పర్వతంమీద నిక్షేపించాడు. శ్వేతమృత్తిక సదా నుదుటధరించే ధన్యుల మనోమాలిన్యం అంతా ఒక్కసారిగా క్షాళితమైపోతున్నది!

"ఈపర్వతంమీద వుండే స్వామి పుష్కరిణికి గంగాసంసర్గం ఉన్నదని ప్రతీతి. ఈ పుష్కరిణిలో మునిగినంత మాత్రానపాపాలన్నీ పటాపంచలైపోతాయి. దీనికి ఈ సమీపంలోనే రజతపీఠపురం కానవస్తున్నది. ఆపట్టణంలోనే ఆనందతీర్థు లవతరించారు. దాని అదృష్టం ఎంతని వర్ణించను?"

కృశానువు:—నీవు చెప్పేదంతా సత్యమే కావచ్చును. కాని ఈ ఆనందతీర్థుల పంథా, అనుసరించే మాధ్వుల దురాచారాలు కొల్లలుగా ఉన్నాయి.

వీరు సముచితకాలాల్లో ఆచరించవలసిన సంధ్యావందనా లెగవేసి తమ మతి శాస్త్రాలు చదవడం మొదలు పెడతారు. బాగా పొద్దెక్కిన తరవాత ప్రాతఃకాల సంధ్యావందనం ప్రారంభిస్తారు. వేదవిహితములైన అగ్నిహోత్రాలు మొదలైనవన్నీ విడిచిపెట్టేస్తారు! ఇలాంటివారు ఇతర మతస్థులనందరినీ ఎందుకూ కొరగానివారని హేళన చేస్తారెందుకో!

ఇంతేకాదు! ఈ మధ్వ మతస్థుల గురువర్యులున్నారే! వీరు మహా చిత్రమైనవారు! ఈ యతిపుంగవులు గాయత్రీమంత్ర పునశ్చరణ మానివేసి, మహా విరాగిలాగ శిఖాయజ్ఞోపవీతాలు విడిచివేస్తారు! 'ఇక మనకి భయమేమిటి!' అన్నట్టుగా ఒకపల్లకీమీద విజయం చేసినవారై దేశదేశాల్లో సంచారం చేస్తూ ధనం ఆర్జిస్తారు!"

ఆహా! కలికాల ప్రభావం వల్ల విద్వాంసులకు కూడా వ్యామోహం కలుగుతున్నదే! వాహనం మీద ఉన్న సన్యాసిని చూచినంతనే సచేల స్నానం చెయ్యాలని చెప్తుంటారు! ఇలాంటివారి ప్రసాదం ఆరగిస్తే ఆ పాప ప్రాయశ్చిత్తంకోసం చాంద్రాయణవ్రతం చెయ్యాలని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి! కాని మాధ్వుల్లో విద్వాంసులుకూడా ఇలాంటి యతీశ్వరుని దర్శించినంతమాత్రం చేతనే ముక్తి కలుగుతున్నదనీ, ఇక ప్రసాదం సమస్త పాపాలు పరిహరించి వేస్తున్నదనీ దృఢంగా విశ్వసిస్తున్నారు!

చూడగా చూడగా కలిమహారాజుకు గృహస్థులంటే ద్వేషము, సన్యాసులంటే పక్షపాతము ఉన్నట్టు కనిపిస్తున్నదే!

ఈ రోజుల్లో గృహస్థులు కడుపు కక్కుర్తితో ముష్టెత్తుకుని ప్రాణాలు నిలబెట్టు కుంటున్నారు! తిరగలేక తిరగలేక వీళ్ళ కాళ్ళరిగిపోతున్నాయి. చింకిగుడ్డలు కట్టుకుని పాడుకొంపల్లో నిద్రిస్తున్నారు!

కాని ఈమాధ్వ సన్యాసులు వేల కొలది గృహస్థులకన్న ప్రదానం చెయ్యగల సమర్థులు! బంగారు పల్లకీలలో ఊరేగుతారు. చక్కని సన్నవలువలు ధరిస్తారు! మహారాజ భవనాలాంటి మఠాల్లో నివసిస్తారు! ఏమి అదృష్టము! ఏమైనా సన్యాసులే ధన్యులయ్యారు!

మాధ్వులు వేదాలు చదవడం మానివేసి, తమ శాస్త్రగ్రంథాలు మాత్రమే చదువుతారు! ప్రభువులను సేవించడం మానివేసి, వారిభక్తులను కొలిచేవారి ధోరణికీ వీరిధోరణికీ భేదం కనిపించడం లేదు!

ఇంకొక్క విషయం! ఏకాదశి నాడు ప్రాతః సాయం సంధ్యలలో హోమాలు మానివెయ్యడంవల్ల మధ్వుల అగ్నిహోత్రాలువట్టి లౌకికాగ్నిహోత్రాలుగా మారిపోతున్నాయి! ఇది శాస్త్రాల్లో చెప్పబడ్డ ధర్మమే! ఇందువల్లనే కాబోలు! అనవసరంగా జంతుహింసాపాతకం చుట్టుకుంటుందని మధ్వులు పిష్ట పశుయాగాలు చేస్తూంటారు! లేకపోతే వీరి పిష్ట పశుయాగానికి కారణమేమీ కనిపించదే!"

విశ్వావసువు:- కృశానూ! భగవద్భక్తులైన బ్రాహ్మణవర్యులను కూడా నిందించడాని కుపక్రమించావూ? మాధ్వుల భక్తి నిష్ఠ పరిశీలిస్తే ఎలాంటి వారికైనా హృదయం ద్రవించిపోతుందే!

పసిపిల్లలు మొదలుకొని వృద్ధుల వరకు అందరు ఏకాదశినాడు కటికి ఉపవాసాలు చేస్తారు!

ప్రతిదినము తప్పకుండా పరమేశ్వరారాధన జరుపుతారు! పరమ భాగవతోత్తముల యెడల మిక్కిలి భక్తితో సంచరిస్తారు. తమ గురువర్యులు బోధించే స్వీయమత శాస్త్రాలు శ్రద్ధా భక్తులతో పఠిస్తారు. మధ్వుల ఆచారాల్లో ఎక్కడైనా ఒక్కదోషం ఉన్నదయ్యా! ఇక మాధ్వ యతివర్యులను నవసరంగా నిందించావే! వారెంతటి మహానుభావులో చెబుతున్నాను. జాగ్రత్తగా విను!

వారు దినదినము పరమేశ్వరుని కభిషేకాలు చేస్తూ పురాణపఠనంలో కాలక్షేపం చేస్తుంటారు. సంసార విమోహానికి కతీతులు. పుణ్యక్షేత్ర సందర్శనంలో అజ్ఞానాంధకారం పూర్ణంగా పటాపంచలై పోయిన పూతచరిత్రులు. బ్రహ్మవిద్యామీమాంసలతో తమకాలం అంతా తన్మయప్రాయముగా గడుపుతునే విజ్ఞానఖనులు!

కృశానూ! వీరు శిష్యసంచారాలకు బయలుదేరి ధనం కూడబెడతారని నిందించావు! అజ్ఞానంతో కళ్లు మూసుకుపోయిన నీలాటివాళ్ళు ఇలా మాట్లాడతారు. సుగ్రహణపారీణులెవరు ఇలా మాట్లాడరు! సుగురువర్యులుఆజ్ఞ ప్రకారం ఈ యతీశ్వరు లాయా దేశాల్లోనివసించే శిష్యగణ సంరక్షణకోసం సంచారం చేయాలిగదా! మరి భౌతికంగా కాలు కదపటానికి శక్తిలేని యీ యతీశ్వరులు వాహనంమీద బయలుదేరితే దీనిలో అపచారం ఏమి ఉన్నది!

ఆ శిష్యులు వీరిదర్శనంచేసి విశేషంగా ధనం సమర్పిస్తారు. అధనం అంతా భగవత్కైంకర్యంకోసం వినియోగిస్తారు. అందులో ఒక్క చిల్లిగవ్వకూడా చేతులతో స్పృశించరు. దీనిలో తప్పేముంది నాయనా!

యతీశ్వరులు స్వయంగా పరమేశ్వరునికి నివేదించిన తరువాత అది పరమేశ్వర ప్రసాదమే అవుతుంది. యతీశ్వర ప్రసాదం కాజాలదు. ఆ ప్రసాదం స్వీకరించినవారికిమాత్రం ప్రత్యవాయమేమున్నది?

ఇక యితర మఠాధిపతులు కూడా ఇలాంటి మహానుభావులే సుమా!

అయితే కొంతమంది మాధ్వులు కొంచెం బద్ధకించి, సరియైన కాలానికి సంధ్యావందనం చెయ్యలేదనుకో! అంతమాత్రానికి మునిగిపోయిందేముంది? శ్రౌతస్మార్త కర్మలు నిందావులని బహిష్కరించడమే నా కర్తవ్యం. అంతేగాని అశక్తతవల్ల ఏర్పడిన అపచారం నాకర్తవ్యం కాజాలదు.

ఇంక మాధ్వులు ఏకాదశినాడు సముచితకాలాల్లో హోమాదులు చెయ్యరు అని మరి ఒక అపవాదు వేశావు. ఇది వీరికి తాతలనాటినించవచ్చిన సంప్రదాయం. ఆ సంప్రదాయం అనుసరిస్తే తప్పేమి?" అని చెప్పి విశ్వావసువు విమానం [illegible] పోనిచ్చి "కృశానూ! ఈ చిత్రవిచిత్రమైన చిన్న చిన్న దేశాలు పరికించావూ? ఇక్కడ ప్రతిదేశంలోను స్త్రీపురుషుల వేషభాషాచారాలు, చాలావిభిన్నంగా ఉన్నాయే!" అన్నాడు.

కృశానుడు: "ఈ పాడు దేశాలన్నీ నన్ను చూడమంటున్నావూ! ఈ ప్రాంతాల జనం అంతా వట్టి క్రోధులుగువులు. వీళ్ళంతా జెలుగు-చీకట్లకు, సంపెంగకు, ముషిడీచెట్లకు, పర్వానికి-బురదగొడ్డుకు, పన్నానికి-ఉసిరికి, పువ్వుకు, కాకులకు-కోరులకు, పాల సముద్రానికీ-పాడుబావికీ, పండితునికీ-మూర్ఖునికీ మధ్యనఉండే తారతమ్యాలు కూడా తెలియని వట్టిమూర్ఖులు!"

# భారత ఎగుమతులలో ప్రత్యేకత పోతున్నది

## దేశాన్ని పారిశ్రామికవంతం చేసి పరిస్థితిని మార్చుకోవాలి

న్యూఢిల్లీ, నవంబరు 27: ఎగుమతి విధానాన్ని పారిశ్రామిక విస్తరణతో సమన్వయంచేస్తూ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో విదేశీ వ్యాపార విధానాన్ని రూపొందించుకోవాలని భారత వాణిజ్య పరిశ్రమల మంత్రి టి. టి. కృష్ణమాచారి నేడిక్కడ ఎగుమతి సలహాసంఘంలో మాట్లాడుతూ హెచ్చరించారు. ఇదివరకు కొన్ని దిగుమతుల్లో భారతదేశమే ప్రపంచమంతటికీ యించుమించు సప్లయిదారుగా ఉండేదికాని, ఇప్పుడు ఆ పరిస్థితి మారిపోతున్నదని, ఆ విషయమై జాగ్రత్త పడాలని ఆయన హెచ్చరిక చేశారు.

1955 సంవత్సరంలో మొదటిమూడు పాదాల్లోనూ 459 కోట్ల రూపాయల సరుకు యెగుమతి అయిందనీ, 1954 ఏటి మొదటి మూడుపాదాలకన్నా 70 కోట్లు ఎక్కువ అనీ ఆయన తెలియజేశారు. ఇదే సమయంలో దిగుమతులు కూడా పెరిగి, ఆర్థికస్థితి చక్కగా ఉన్నట్లు నిరూపిస్తున్నదని ఆయన అన్నారు. ఎగుమతి వ్యాపారాన్ని పెంచేనిమిత్తం కొత్త సరుకులను ఎగుమతి చేయటమేకాక, కొత్త మార్కెట్లనుకూడా సంపాదించటం అవసరమని ఆయన సూచించారు.

"ఎగుమతి వ్యాపారంలో పశ్చిమ జర్మనీ, జపాన్‌ల పోటీ యెక్కువ. మనకు జపాన్‌పోటీ తీవ్రమయింది. మన ఎగుమతివ్యాపారం అంతా జపాన్ చేసే వ్యాపారంవంటిదే. జపాన్ వ్యాపారములో ప్రత్యేక సమస్యలు ఉన్నందువల్ల ప్రపంచ వాణిజ్య విధానాల ఒప్పందం సభ జెనీవాలో వాటిని పరిశీలిస్తున్నది.

తూర్పు యూరప్ దేశాలు కూడా ఎగుమతి వ్యాపారంలో పడ్డవి. నియంతృత్వ దేశాలయినందువల్ల అవి విడుపులేకుండా ఎగుమతులను సాగించగలవు. వాటిలో జెకోస్లవేకియా తప్ప మిగిలినవి అంతర్జాతీయ వాణిజ్య విధానాల ఒప్పందంలో చేరలేదు.

### పారిశ్రామిక విధానం

మన ఎగుమతులు చాలా హుషారుగా జరగాలి. ఖచ్చితమయిన పారిశ్రామిక విధానాన్ని ఇంతవరకూ నిర్ణయించలేదు కనుక ప్రభుత్వలోపం కూడా ఇందులో కొంతఉన్నది. ఈవిధానాన్ని నిర్ణయించటానికి ఎక్కువగా దేశంలోపలి పరిస్థితులే పరిగణించబడుతున్నవి కాని ఎగుమతి అవకాశాలతో దానిని సమన్వయించాలని చూట్టంలేదు. ఎగుమతిచేసే పరిశ్రమలకు ఒక విధానం, దేశంలో వాడకంఅయ్యే సరుకుల పరిశ్రమలకు మరొక విధానం అనుసరించటం సాధ్యంకాదు. ఈ రెండురకాలయిన గిరాకీలకు తేడా నిర్ణయించటం కష్టం. ఎగుమతులను దేశంలో వాడకంతో పాటుగానే అభివృద్ధి చేయటం మంచిది. దేశంలో వాడకంతో సంబంధంలేకుండా, కేవలం ఎగుమతుల మీద ఆధారపడే ఆర్థిక వ్యవస్థకు స్థిమితం ఉండదు.

అందువల్ల ఈ అంశాలన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ద్వితీయ ప్రణాళిక సందర్భంలో విదేశీ వ్యాపార విధానం ఒకటీ-పారిశ్రామిక విస్తరణ విధానంలో సమన్వయిస్తూ- ఏర్పడటం అవసరం.

మన ఎగుమతుల పెరుగుదల తేయాకు, నూనెలు, నూనెగింజలు, జనపనార వస్తువులు, పొగాకు, దూది, జీడిపప్పు, అభ్రకం, లక్క ఎగుమతులకు వర్తిస్తుంది. ముఖ్యంగా నూనెలు, నూనెగింజల ఎగుమతులు 7 కోట్ల రూపాయలు పెరిగినవి (37 కోట్లు). నార సరుకుల ఎగుమతులు 87 నుంచి 98 కోట్లకు పెరిగినవి. నార సరుకులమీద ఎగుమతిసుంకాలు రద్దుఅయిన వన్న అంశాన్ని గమనిస్తే ఈ ఎగుమతులు ఎంత పెరిగినవో తెలుస్తుంది. తేయాకు ఎగుమతి అయిదోవంతు పెరిగింది.

### నూలు వస్త్రాల ఎగుమతి సమస్య

అయితే మన ఎగుమతుల్లో కొన్ని కోరదగినవి కావు. దూది ఎగుమతి సాగుతూ ఉండటం మనకు మంచిది కాదు. ఆ ఎగుమతివల్ల వస్త్ర ఎగుమతుల్లో మనతో పోటీచేసే వాళ్ళకు చవగ్గా దూది లభించి, మన వస్త్ర ఎగుమతులు ఆ మేరకు తగ్గిపోగలవు. ఈ సందర్భంలో మనం గమనించవలసిన అంశం ఏమిటంటే 1955 మొదటి మూడు పాదాల్లోనూ నూలువస్త్రాల ఎగుమతి 1954 కన్నా 590 లక్షల గజాలు తగ్గిపోయినవి.

అదీకాక ప్రపంచంలో వస్త్రాల వ్యాపారంలో విచిత్ర పరిస్థితులు ఏర్పడినవి. వస్త్ర ఎగుమతి ప్రోత్సాహ సంఘం ఈ సమస్యలను మన దృష్టికి తీసుకుని వస్తున్నది.

దేశంలో మిలు వస్త్రాల ఎగుమతి ఒకే ప్రమాణంలో ఉండగా, వాడకం పెరిగిపోతున్నది. చేనేత మొదలైన రకాల పరిశ్రమ ఈ వాడకం అవసరాలను కొంతవరకు తీర్చగలిగినా, మొత్తం మీద ఉత్పత్తి ఇట్లాగేఉంటే, ముందు ముందు ఎగుమతులను పెంపొందించటం అసాధ్యం. కేవలావసరాల తగ్గించుకుని ఎగుమతులు చేయమనటం కష్టం.

### తేయాకు

మన ఎగుమతుల్లో కల్లా ఎక్కువ విదేశీ ధనాన్ని తీసుకునివచ్చేది తేయాకు. దీని ఎగుమతులను ఆట్టే పెంచే అవకాశం కనిపించటం లేదు. తేయాకు తోటల యాజమాన్యం, నిర్వహణల్లో జరుగుతున్న మార్పులు తేయాకు ఉత్పత్తికి తోడ్పడతవా అని సందేహం. ప్రస్తుతం తోటల విచారణసంఘం నివేదికకోసం ఎదురుచూస్తున్నాము. కాని ఈ లోపలపరిస్థితులను ఉపేక్షించే దిలేదు. తేయాకు తోటల నిర్వహణ విషయంలో ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధవహించవలసి వున్నది.

### జనపనారలో పాకిస్తాన్ పోటీ

నారవస్తువుల ఎగుమతిలో నారను ఉత్పత్తిచేసే మరొక దేశం పోటీకి వచ్చింది. ఈ పరిస్థితులను ప్రభుత్వం గమనిస్తూ అవసరం వచ్చినప్పుడు తక్షణం తగిన చర్యలు తీసుకున్నది. యంత్రాలను ఆధునికంగా చేయటానికి తోడ్పడటంద్వారా పరిశ్రమను బలపరుస్తున్నది. ఇంకో మన సరుకుల నాణ్యతను అభివృద్ధిచేయటం, ధరలను సర్దుబాటుచేస్తూ ఉండటం, స్పెక్యులేషన్‌ని అణిచివేయటం మొదలైన చర్యలవల్లనే ఇతరుల పోటీలను తట్టుకొనటం సాధ్యపడదు. ఇది మొత్తానికి కష్టతరమయినపనే.

లక్క ఎగుమతులకు కావలసిన సరుకు లభించటంలేదు. ఖనిజాల ఎగుమతులను పెంచవచ్చును కాని వాగన్లకొరత, రవాణా చార్జీలు ఎక్కువగా ఉండటం చిక్కులు కలిగిస్తున్నవి.

చేనేత వస్త్రాలలో కొన్ని రకాలకు కొన్ని దేశాల్లో గిరాకీ వచ్చింది. మనవారు తగిన చొరవ, తెలివితేటలు చూపితే దీనిని అభివృద్ధి చేయవచ్చు. అయితే రోజుకొక ఫాషన్ మారే దేశాల అభిరుచులమీద మనం అట్టేఆధారపడకూడదు.

కొత్త మార్కెట్లను సేకరించుకోవాలి. ఆసియా ఆఫ్రికా దేశాలకు మనం ఎగుమతులు చేయవచ్చు. బాండుంగ్ సమావేశం ఈ ప్రాంత వ్యాపారాన్ని పెంచాలని సూచించింది. తూర్పు యూరప్ దేశాలు కూడ వ్యాపారాభివృద్ధికి మంచిఅవకాశం ఇస్తున్నవి. ప్రపంచంలో వ్యాపారం చేస్తున్న ఇంచుమించు ప్రతి దేశంతోనూ మనం వాణిజ్య ఒప్పందాలు చేసుకున్నాము.

పంచవర్ష ప్రణాళిక సాగాలంటే అధిక ఎగుమతుల ద్వారా డబ్బును సేకరించటం అవసరం. విదేశీ సహాయం మీద ఆట్టే ఆధారపడకూడదు. ఇంతవరకూ వ్యాపారంలో కనిపించిన అభివృద్ధి తృప్తికరంగా లేదు. అందువల్ల మనం శక్తికొద్దీ కృషిచేయాలి.

ఇది కష్టమయినా, అసాధ్యం మటుకు కాదు. ఎగుమతులను ప్రోత్సహించేందుకు గాను ప్రతి సరుక్కీ ఎగుమతి ప్రోత్సాహ సంఘాలు ఏర్పాటయినవి. ఇట్లా పొగాకు, అభ్రకం, లక్క, తోలు పరిశ్రమలకు ప్రోత్సాహ సంఘాలు ఏర్పాటు కాబోతున్నవి. నూలు వస్త్రాలు, పట్టు, మాయపట్టువస్త్రాలు, ప్లాస్టిక్ సామాన్లు, ఇంజనీరింగ్ సరుకులు, జీడిపప్పు, మిరియాల ఎగుమతులకు ఏర్పాటు అయినవి. ఈ సంఘాల అధ్యక్షులు, బాండుంగ్ సభ దేశాల్లో ఉన్న భారత రాజ్య ప్రతినిధులను ఎగుమతులను పెంచే విషయమై సలహాలిచ్చే నిమిత్తం ఈ సభకు ఆహ్వానించారు.

### దిగుమతి సుంకం వాపస్

దిగుమతి చేసిన సరుకులను తిరిగీ ఎగుమతి చేసే సరుకుల్లో వాడి ఎగుమతి చేస్తే, వాటిని దిగుమతి చేసేటప్పుడు కట్టిన సుంకాలను వాపస్ చేసేందుకు వీలుగా సముద్ర సుంకాల చట్టం సవరించబడ్డది. కాని ఈ సవరణ సౌకర్యాన్ని పూర్తిగా వినియోగించుకుంటున్నట్టు కనిపించదు. గత ఏడాదిలో ఇట్లా వాపసు కోరిన మొత్తం 4 వేలకు మించలేదు.

### నౌకారవాణా చార్జీల

నౌకారవాణా చార్జీల సమస్యను పరిశీలించేందుకు [illegible] నియమించాము. చార్జీలు క్రమంగా లేవని చెప్పబడ్డ 85 సందర్భాల్లోను 16 సందర్భాల్లో చార్జీల సవరణ జరిగేటట్లు ఆ ఉద్యోగి చూడకలిగారు. చార్జీల్లో అక్రమాలను ఈ ఉద్యోగి దృష్టికి తీసుకుని రావటంలో కూడా ఎగుమతిదార్లు శ్రద్ధతీసుకొనటం లేదు. ప్రభుత్వం ఇటీవల ఖండాంతర నౌకా సర్వీసుల సమాలోచన సంఘం ఒకదానిని ఏర్పాటు చేసింది.

ఎగుమతి ఋణాలకు హామీ ఇచ్చే సంస్థను నెలకొల్పాలన్న ప్రతిపాదన మీద సలహా ఇచ్చేందుకు ప్రభుత్వం ఒక నిపుణులసంఘాన్ని నియమించింది. ఆ సంఘం నివేదికను పట్టి తరవాతి చర్య ఆధారపడి ఉంటుంది.

దిగుమతి చేసుకున్న వాళ్లు సొమ్ము చెల్లించటం మొదలైనవి సరిగా చేయలేదని మన ఎగుమతిదార్లు ఫిర్యాదు చేయటం, అనుకున్న సరుకు అనుకున్నట్టు పంపలేదని దిగుమతిదార్లు ఫిర్యాదు చేయటం జరుగుతునే ఉన్నది. ఎగుమతి ప్రోత్సాహ సంఘాలద్వారా కొంతవరకూ వీటిని పరిష్కారం చేయవచ్చు. ఈ విషయంలోఅందరు సూచనలు చేయటం అవసరం" అని కృష్ణమాచారిగారు వివరించారు.

భారత వాణిజ్య సమాఖ్య అధ్యక్షుడు శ్రీ శాంతిలాల్ మంగల్‌దాస్ మాట్లాడుతూ రేవులకు దూరంగావుండే నూలు మిల్లులు ఎక్కువ ఎగుమతి చేయటానికి వీలుగా రవాణా రేట్లను తగ్గించాలని అన్నారు. ఇంజనీరింగు వస్తువుల ఎగుమతికి ప్రభుత్వం సాయపడాలన్నారు.

భారత ఎసోసియేటెడ్ వాణిజ్య మండలి ప్రతినిధి బర్న్స్ మాట్లాడుతూ ఎగుమతి సుంకాలను వీలయినంతవరకూ రద్దుచేయటమో, తగ్గించటమో చేయాలని అన్నారు.

ఒకటి రెండేళ్లలో పొగాకు, ఎగుమతులు 15 కోట్లవరకూ పెరగ్గలవని రంగా శాలిగారన్నారు.

### అలస్యాలకు పరిహారం

సహకార విక్రయసంఘాలకు ఎగుమతి కోటాలను పెంచాలని ఎస్. ఆర్. ఈశ అన్నారు. రేవు కూలీలు కొండెక్కి కూర్చుంటున్నారనీ, ఆ విషయమై ప్రభుత్వం చర్యతీసుకోవాలనీ నెవిల్ వాడియా అన్నారు. స్విట్జర్లాండ్‌లో రవాణా చిక్కులవల్ల ఆలస్యం జరిగితే పరిహారం ఇచ్చే ఏర్పాటు ఉన్నదని అన్నారు. భారత రైల్వేలు ఇటువంటి పథకాన్ని ఆలోచిస్తున్నవని రైల్వే బోర్డుల సభ్యుడు కె. బి. మధుర్ అన్నారు.

ఎస్. ఎల్. కిర్లోస్కర్ ఇంజనీరింగ్ పరిశ్రమకు కావలసిన ఉక్కు దొరకటం ఇబ్బందిగా ఉన్నదని అన్నారు.

## దిగుమతుల సలహాసంఘ సమావేశం

న్యూఢిల్లీ, నవం 26: ఈగాండా పత్తిని పరిమితి ఏమీ లేకుండా దిగుమతి చేసుకోనివ్వాలని భారత వాణిజ్య పరిశ్రమల మండలుల సమాఖ్య అధ్యక్షుడు శ్రీ శాంతిలాల్ మంగల్ దాస్ భారత ప్రభుత్వాన్ని అభ్యర్థించారు.

దిగుమతుల సలహా సంఘం సమావేశంలో మాట్లాడుతూ ఆయన వస్త్ర పారిశ్రామికులు అమెరికా పత్తిని తెప్పించుకోవటానికి సుముఖంగా లేరనీ, ఇప్పటి దిగుమతులు చూస్తే ఆ సంగతి స్పష్టపడుతుందనీ, పైగా అమెరికా పత్తి ఖరీదు కూడా ఎక్కువనీ అన్నారు.

కాస్టిక్ సోడా కరువై ధరలు పెరిగిపోయాయనీ, ఇందుకు కారణం దిగుమతులపై నిర్బంధమో లేక దేశంలో తగినంత తయారు కాకపోవటమో తెలియటం లేదనీ అన్నారు.

రేయన్ నూలు దిగుమతి తగ్గటంవల్ల దాని ధరలు కూడా పెరిగాయనీ, దిగుమతులు ఎక్కువ చేస్తే అవి తగ్గుతాయనీ, చేతి గడియారాలను విలాస వస్తువులుగా పరిగణించరాదనీ, అవసర వస్తువులుగా ఎంచి, ప్రస్తుతం వున్న 78% సుంకాన్ని తగ్గించాలనీ కూడా ఆయన అన్నారు.

శ్రీ ఎస్. ఎం. షా దిగుమతుల విషయంలో ఏ వస్తువులకు ఎంత గిరాకీ వున్నదీ గమనించాలన్నారు. దిగుమతులపై నిర్బంధాలవల్ల ఈ వ్యాపారం చేసేవారు చాలామంది దెబ్బ తిన్నారనీ, దేశీయ పరిశ్రమలకు ప్రోత్సాహమిచ్చేందుకు ఈ నిర్బంధాలు పెడుతున్నారు కనుక దేశంలో తయారయే వస్తువుల పంపిణీని ఈ వ్యాపారంలోని వారికి ఇప్పించాలనీ అన్నారు. ప్రభుత్వ వ్యాపార సంస్థను నెలకొల్పటంలో వుద్దేశం ఏమిటో తెలపాలని కోరారు.

వాణిజ్య మంత్రి టి. టి. కృష్ణమాచారి ప్రభుత్వం అటువంటి సంస్థను ఏర్పరచాలని వుద్దేశించిందనీ, ఆ సంస్థ ఏమి చేస్తుందో ఇప్పుడు చెప్పటం కష్టమనీ అన్నారు.

శ్రీ కె. ఆర్. ఎస్. అయ్యర్ సైకిళ్లపై దిగుమతి సుంకం తగ్గించాలన్నారు. ఆ అవసరమేమీ కనిపించటం లేదని శ్రీ కృష్ణమాచారి అన్నారు. దేశంలో సైకిళ్ళను తయారు చేసేవారు, ఇక ఎన్ని సైకిళ్ళను దిగుమతి చేసినా ఫరవాలేదు అనే వరకూ ఈ సుంకం తగ్గదన్నారు. అయిదేండ్ల వరకూ తగ్గే సూచన ఏమీ లేదని కూడా అన్నారు.

## దీజాజంతో చర్చించాలని ఫ్రెంచి మంత్రి సంకల్పం

పారిస్, నవంబరు 26: [illegible] విశ్వాసం ప్రధానిలో సంప్రతింపుల నిమిత్తం ఫ్రెంచి విదేశాంగ మంత్రి ఆంటోనీ పినే సైగాన్ కు త్వరలో బయలుదేరాడని ప్రకటన వెలువడింది.

# సంపాదకునకు లేఖలు

## విజయనగరం జిల్లా అత్యావసరము

అయ్యా, ది 23-11-55 ఆంధ్ర దినపత్రికలో జిల్లాల పునర్వ్యవస్థీకరణ గూర్చి ఆంధ్ర రెవిన్యూ మంత్రి అభిప్రాయము వెలువడినది. చాలా హర్షనీయము. విజయనగరం జిల్లాగా చేయుట అవసరము. విశాఖపట్టణము నుండి జిల్లా విభజన జరుగునప్పుడే యీ అభిప్రాయమున్నది. పార్వతీపురం డివిజను శ్రీకాకుళం జిల్లాలో కలుపగూడదనే ఆందోళన మొదటనుండి వుంది. యీ విషయం యీనాటి మంత్రులందరికి తెలుసును. ఏవో కొన్ని కారణముల వలన మా ఆందోళన గూడా పెడచెవిని బెట్టి పార్వతీపురం డివిజనును విశాఖ జిల్లానుండి విడదీసిరి. యీ విభజనానంతరము శ్రీకాకుళం జిల్లా అభివృద్ధి అందరికి తెలిసియే వున్నది. యింతవరకు ఎట్టి అభివృద్ధి జరుగలేదు. మీదుమిక్కిలి అసౌకర్యములు ఎక్కువై యీ ప్రాంతపు విద్యార్థులంతా విజయనగరం, విశాఖపట్టణం కాలేజిలలోనే చదువుచున్నారు. యీ డివిజనుకు అన్నివిధముల వాణిజ్యవర్తక రాకపోక సంబంధాలన్నీ నేటికి విజయనగరముతోనే జరుగుచున్నవి. వ్యాపార సంస్కృతిక సంబంధాలు నిత్యము విజయనగరముతోనే జాస్తి. విజయనగరం జిల్లా కేంద్రంగా చేయుట అన్నివిధముల మంచిది. పరిపాలనా సౌలభ్యమునకెంతో తోడ్పడును. ఖర్చు గూడా తక్కువ అవుతుంది. అన్ని సౌకర్యములు అమరినట్లు యిప్పటికే వున్నవి. యీ ప్రాంతము శ్రీకాకుళంతో సన్నిహితత్వము ఏర్పరచుకొనేందుకు వివిధమైన అవకాశములు లేవు. ముందు గూడా కలుగబోవు. ఈ డివిజనులోని శాసనసభ్యులు యిందుగూర్చి పట్టుదలతో కృషిచేయుట అవసరం. శ్రీ ఆంధ్ర ప్రభుత్వమువారు గూడా విజయనగరం జిల్లా చేయుటకు సత్వర చర్యలు తీసుకొనగలరని ఆశిస్తున్నాము.

పార్వతీపురం: వంగపాడు పారన్న.
గొర్లె సూర్యనారాయణ.

* * *

## ధాన్యం అమ్మకంపన్నులో అక్రమాలు

అయ్యా,

"ప్రభుత్వము ధాన్యపుమిల్లు యజమానులపై విధించే అమ్మకంపన్నును ఈ మిల్లు యజమానులు అటు ధాన్యం కొనునప్పుడు ధరలో మినహాయించుట ద్వారా రైతులవద్దనూ, ఇటు మిల్లు చేసిన బియ్యమును అమ్మునప్పుడు వినిమయదారులవద్దను ఇలా రెండుచోట్ల వసూలు చేయుచున్నారు. కాని వారు చెల్లించవలసివచ్చే దానిలో కూడా ఎక్కువభాగమును చెల్లించకుండా తప్పించుకొనుట జరుగుచున్నది.

ఇందువల్ల రైతులకు ఇవ్వవలసిన ధరలో కొంత తగ్గించియిచ్చి, ఆ మేరకు రైతులను నష్టపెట్టుట జరుగుచున్నది. అధికార్లకు ఈ విషయము తెలియదో తెలిసినా పట్టించుకోరో అర్థం కాకున్నది. ప్రతిమిల్లు రోజుకు ఎన్ని బస్తాలు ధాన్యంబియ్యం చేయగలదు. నెలలో ఎన్నిరోజులు పనిచేస్తున్నది. అనే విషయాలను పరిశీలించినట్లయిన ఈ మిల్లు యజమానులు రైతులసొమ్మును ఎంత మినహాయించుకొంటున్నదీ, ప్రభుత్వమునకు రావలసిన ఎంత మొత్తము అమ్మకము పన్నును చెల్లించడంలేనిదీ, తెలియగలదు. కావున ప్రభుత్వంవారు ఈ విషయమై శ్రద్ధవహించి ఈ రెండు రకముల అక్రమ చర్యలను అరకట్టవలసిందిగా కోరుచున్నాను."

గుంటూరు: కల్లూరి వీరయ్య.

## నూజివీడు తాలూకా కాంగ్రెసు కార్యవర్గం

విజయవాడ, నవంబరు 21: కృష్ణా జిల్లా, నూజివీడు తాలూకా కాంగ్రెసు సర్వసభ్య సమావేశం యీనెల 20వ తేదీన జరిగింది. క్రింది కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికయింది: శ్రీ పర్వతనేని వెంకటసుబ్బయ్య (అధ్యక్షులు), శ్రీ చింతపల్లి రంగారావు (ఉపాధ్యక్షులు), శ్రీ అక్కినేని అచ్యుత రామయ్య (ప్రధాన కార్యదర్శి), శ్రీయుతులు నాదెళ్ళ సత్యనారాయణ, వంకదారు మంగాద్రి (సహాయ కార్యదర్శులు), కోగంటి వెంకటేశ్వరరావు, మేడేపూడి సుబ్బారావు, గోగినేని భద్రాచల సీతారామయ్య, మూదల వెంకటేశ్వరరావు, జన్నావుల పాండురంగారావు, ఎన్. టి. పి. శ్రీనివాస వరదాచార్యులుగారలు సభ్యులు.

## గుంటూరు జిల్లా కాంగ్రెసు సభ్యత్వాలు

గుంటూరు, నవంబరు 24: జిల్లాలో కాంగ్రెసు సభ్యత్వం చేర్పించడం డిసెంబరు 21 లోగా పూర్తికావాలని పొడిగించడం సాధ్యంకాదని జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ వి. సత్యనారాయణ ప్రకటిస్తున్నారు.

తాలూకా, పట్టణ, కాంగ్రెసు సంఘాలకు 4 వేలు, 2 వేలు శాసన సభ్యులకు, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులకు 500 [illegible] జిల్లా కాంగ్రెసు కార్యవర్గం నిశ్చయించిందని, [illegible] దఫా ఉద్యమం జరుగుతుందని తెలిపారు.

## రెండు రాష్ట్రాలకు కాంగ్రెస్ ప్రాతికూల్యం

1 వ పేజీ 2 వ కాలం తరువాయి

ఏర్పాటు చేయవలసిందిగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ నాగులవంచ ఉన్నత పాఠశాల విద్యార్థుల సభలో తీర్మానించారు.

ఇదే విధంగా నాగులవంచ గ్రామ పంచాయతీ, గ్రామ కాంగ్రెసు, మధిర తాలూకా ఎర్రుపాలెం గ్రామ కాంగ్రెసుకూడా సత్వర విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతూ ఏకగ్రీవ తీర్మానాలు చేశారు.

## గోకినేపల్లి పంచాయతీ విజ్ఞప్తి

సత్వర విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతూ ఖమ్మం తాలూకా గోకినేపల్లి గ్రామ పంచాయతీ, గ్రామీణ కాంగ్రెసు ఏకగ్రీవ తీర్మానాలు చేశారు.

## మధిర విద్యార్థుల సమ్మె

వెంటనే విశాలాంధ్రను ఏర్పాటు చెయ్యాలని కోరుతూ మధిర ఉన్నత పాఠశాల విద్యార్థులు సమ్మె చేశారు. రామబ్రహ్మంగారి నాయకత్వాన సుమారు 800 మంది విద్యార్థులు ఊరేగింపు జరిపారు. దుకాణాలు మొదలయినవి మూసివేశారు.

## ఖమ్మం విద్యార్థుల సమ్మె

ఖమ్మం విద్యార్థుల ఈ నెల 24, 25 తేదీలలో పడికి పర్సడం మానివేశారు. ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర నిర్మాణానికి అనుకూల నినాదాలతో ఊరేగింపు చేశారు.

పట్టణంలో యీ నెల 25 నుంచి పోలీసు బందోబస్తు ఎక్కువైంది.

## ప్రశాంతంగా చేయండి

మధిర, నవంబరు 20: విశాలాంధ్ర నిర్మాణ సమస్యపై తమ తమ అభిప్రాయాలను ప్రశాంతంగా తీర్మానాల ద్వారా భారతప్రభుత్వానికి తెలియ జేయవలసిందిగా తెలంగాణాలోని విద్యార్థులకు విజ్ఞప్తిచేస్తూ మధిరపూర్వ విద్యార్థిసంఘం ఉపాధ్యక్షుడు శ్రీ అప్పారావుగారు ఒక ప్రకటన చేశారు. ఈ సమస్యను రాజకీయ సమస్యగా రూపొందించవద్దని కూడా ప్రకటనలో విద్యార్థులను అభ్యర్థించారు.

## మానుకోట పురపాలకసంఘం

### తక్షణం విశాలాంధ్ర కావాలని తీర్మానం

మహబూబాబాద్, నవంబరు 21: తక్షణం విశాలాంధ్రను ఏర్పాటు చేయవలసిందిగా భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ స్థానిక పురపాలక సంఘం తీర్మానించారు.

ఇదే విధంగా అభ్యర్థిస్తూ విశాలాంధ్ర సమితి ఆధ్వర్యాన 18 సంస్థలు భారత ప్రధాని శ్రీ నెహ్రూ, కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ధేబర్ లకు తంతి విజ్ఞప్తులు పంపించారు.

సత్వర విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతూ స్థానిక న్యాయవాదుల సమావేశంలో తీర్మానించారు.

అల్జీర్స్, నవంబరు 27: అల్జీరియాలో గడచిన 24 గంటలలోను, ఫ్రెంచి సైన్యాలకు విప్లవకారులకు తీవ్ర సంఘర్షణలు జరిగాయి. 30 మంది తిరుగుబాటుదార్లు హతులైనట్లు ఫ్రెంచి ప్రకటించారు.

## నేరాల సంఖ్య తగ్గుదల

### ఉన్నంతలో బొంబాయి అగ్రస్థానం

న్యూఢిల్లీ, నవంబరు 27: దేశంలో నేరాలు నిరుడు తగ్గుముఖం చూపినట్లు హోంశాఖకు చెందిన రహస్య సమాచారసంస్థ ప్రకటించిన నివేదికవల్ల తెలుస్తోంది.

1954-లో 1953-లో కంటే 7.5% తగ్గాయి. 1949 నుంచి 58 వరకూ అయిన నేరాల సగటు సంఖ్యకంటే ఇది 11.7% తక్కువ. 1954-లో మొత్తం నేరాలు 556, 912. రాష్ట్రాల వారీగా చూస్తే నేరాలకు అగ్రస్థానం బొంబాయిది. అక్కడి నేరాలసంఖ్య 71,435. తర్వాతి వరస ఇట్లా వుంది: ఉత్తరప్రదేశ్-64,467. మద్రాస్-59,177. బీహారు 57,857. మధ్యప్రదేశ్-56,721. పశ్చిమ బెంగాల్ 56,320.

లక్ష జనాభాకు ఎన్ని నేరాలు జరగాయన్న లెక్కను చూస్తే ప్రథమ స్థానం అండమాన్, నికోబార్ దీవులకు వచ్చింది. తర్వాత వరసగా ఢిల్లీ, మధ్యప్రదేశ్, భోపాల్, కచ్చ్, పశ్చిమ బెంగాల్, సౌరాష్ట్ర, మధ్యభారత్ వచ్చాయి.

నేరాలు ఎక్కువగా జరిగిన పట్టణాల వరస ఇట్లా వుంది: బొంబాయి, కలకత్తా, ఢిల్లీ.

### ఇళ్లల్లో దొంగతనాలు

నేరాలలో చోరీలు అన్నిటికంటే ఎక్కువ. వీటి సంఖ్య 2,23,865. తర్వాత ఇళ్లల్లో దొంగతనాలు. అవి 1,32,457. ఈ రెండు కూడా 1953-లో కంటే తక్కువే. వ్యక్తుల అపహరణలూ, కొల్లగొట్టలూ మాత్రం కొద్దిగా ఎక్కువయినాయి.

### హత్యలు

1954లో జరిగిన మొత్తం హత్యలు 9,765. గత సంవత్సరంకంటే ఇది 0.4% తక్కువ. 400కు మించి హత్యలు జరిగిన రాష్ట్రాల వరస ఈవిధంగా వుంది: ఉత్తరప్రదేశ్-1607. బొంబాయి-1293. మద్రాస్ 1196. బీహారు 867. మధ్యప్రదేశ్-679. హైదరాబాదు-644. ఆంధ్ర-617. పంజాబు-470. మధ్యభారత్-406. పశ్చిమ బెంగాల్ 404.

హత్యానేరానికి విచారించబడిన వారి సంఖ్య 18,286. వీరిలో 6,122 మందికి శిక్షలుపడి, మిగతావారు విడుదలయినారు.

అభియోగాల దర్యాప్తు, విచారణ కూడా అసంతృప్తికరంగా వుంది.

## కొరియాలో తప్పిపోయిన సైనికుల సమస్య

పాన్ముంజాం, నవంబరు 26: కొరియా యుద్ధంలో కనిపించకుండా పోయిన 2720 మంది మిత్ర రాజ్యసైనికుల జాడ తెలియజేస్తే 99789 మంది కమ్యూనిస్టులగురించి సంజాయిషీ యివ్వగలమని సమితి సైనిక కార్యాలయం నేడు కమ్యూనిస్టులకు తెలియబరచింది.

## మొరాకోలో మంత్రి మండలి నిర్మాణయత్నం

రాబట్, నవంబరు 26: ప్రథమ మొరాకన్ ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటుచేయవలసిందిగా ఏ పార్టీకి చెందని జాతీయవాది "సి బెక్కాయ్" ను సిద్దీ మహమ్మద్ బేయూసఫ్ నేడు కోరాడు.

## సారా కాపు అవరోధం

### మద్య నిషేధానికి

### పరిపాలనా శాఖ సమీక్ష

కర్నూలు, నవంబరు 28: మద్య నిషేధ చట్టాన్ని సక్రమంగా అమలు జరపడానికి కాపుసారా తయారు చెయ్యడం పెద్ద అవరోధంగా ఉన్నది. విశాఖపట్టణం, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో కాపుసారా తయారు చెయ్యడం ఎక్కువ. నీరా తయారు చెయ్యడానికి అనుమతించడమనేది మద్యనిషేధ విధానంలో పెద్ద లోపం. నీరా గీతకు ఉభయ గోదావరి జిల్లాలలో ఇచ్చిన అనుమతులను దుర్వినియోగం చేస్తున్నారని అనేక ఫిర్యాదులు వస్తున్నవి. మద్యనిషేధం అమలులోకి వచ్చిన మొదటి రోజులలో ప్రజలలో ఈ చట్టం అమలు జరపడానికి కనిపించిన ఉత్సాహం, సహకారం ఈనాడు లేనే లేవని చెప్పాలి." అని 1954 మార్చి 31 వ తేదీతో అంత్యమైన 6 నెలల్లో ఎక్సయిజు, మద్యనిషేధ శాఖల కార్యకలాపాల సమీక్షలో ఉన్నది. ఈ ప్రకటనలో ఈ క్రింది ప్రధాన విషయాలను వివరించారు.

నెల్లూరు, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో మద్యనిషేధ చట్టాన్ని పోలీసు శాఖ అమలు జరుపుతున్నారు. మిగతా జిల్లాలలో మద్యనిషేధశాఖ అమలు చేస్తున్నారు.

ఈ సమీక్ష కాలంలో మద్యనిషేధ నేరాలకు గాను మొత్తం 82 మంది ఉద్యోగులను శిక్షించారు. 30 నేరాలలో ఉద్యోగులను బర్తరఫ్ చేశారు. ఉద్యోగాభివృద్ధి జీతనాలను నిలిపివేయడం, వంటి శిక్షలను ఇతర నేరాలకు విధించారు. 6 గురు మద్యనిషేధశాఖ కావలాదారులను (గార్డ్సు) అరెస్టు చేశారు.

ఏజెన్సీ ప్రాంతంతో సహా రాష్ట్రంలో ఎక్కడా ప్రభుత్వం అనుమతించిన సారాదుకాణాలు లేవు. అయితే 1886 అబ్కారీ చట్టంప్రకారం ఏజెన్సీ ప్రాంతాలలో కొంతమంది పరిమితంగా సొంతి వాడకానికి సారా అట్టిపెట్టుకు నేందుకు అనుమతించారు. ఏజెన్సీ ప్రాంతంలో కోయలు సొంతి వాడకానికి పరిమితంగా కల్లు అట్టిపెట్టుకునే సౌకర్యం కూడా ఉన్నది. ఇందుకు గాను కోయలు ఈ ఆరునెలల్లో మొత్తం 19941 చెట్లనుగీశారు. తీపికల్లుకోసమని ఏజెన్సీ ప్రాంతాలలో ఈ సమీక్ష కాలంలో చెట్లనెవరూ గియ్యలేదు.

### విదేశాలనుంచి వచ్చిన సారా

విదేశాలనుంచి మొత్తం 270 గాలన్ల సారా దిగుమతి అయింది. సారా ఉపయోగించి చేసే మందులపై పన్ను వల్ల ప్రభుత్వానికి మొత్తం రూ. 35,792 ఆదాయం వచ్చింది. సారా కలిసిన ఇతర వస్తువుల పన్ను రూపంలో రూ. 3,778 ఈ 6 నెలల్లో ప్రభుత్వానికి ఆదాయం వచ్చింది. ఇతర రాష్ట్రాల నుంచి ఈ రాష్ట్రానికి దిగుమతి అయిన సారా కలిసిన వస్తువులపై పన్ను రూపంలో ప్రభుత్వానికి రూ. 63,295 ఆదాయం వచ్చింది.

ప్రభుత్వ అనుమతులతో మాత్రమే మందులు, శాస్త్రీయ పరిశోధనలవంటి వాటికి నల్లమందు వాడవచ్చు. మద్య నిషేధం అమలులో లేని కొండజాతుల ప్రాంతాలతో సహా రాష్ట్రంలో ఎక్కడా నల్లమందు దుకాణాలులేవు. తాలూకాఫీసులలోనే నమోదయిన వాడకం దార్లకు నల్లమందును విక్రయిస్తున్నారు.

ఈ 6 నెలల్లో రాష్ట్రంలో 187 సేర్లు 28 తులాల నల్లమందు వాడకమయింది. ప్రభుత్వానికి రూ. 65,760 ఆదాయంవచ్చింది.

ఈ శాఖలోని వివిధ పద్దులవల్ల రూ. 6,62,242-12-9 ఆదాయంరాగా రూ. 18,44,822-10-8 ఖర్చయింది.

### నేరాలు

మద్యనిషేధశాఖ ఆధ్వర్యంలోని నేరపరిశోధకశాఖ ఈ 6 నెలల్లో 70 సారా నేరాలను కనిపెట్టారు.

రాష్ట్రంలో మూడు బట్టీలున్నవి. ప్రత్యేకంగా పరిశోధనాలయం లేదు. మద్రాసు రాష్ట్రప్రభుత్వ పరిశోధనాలయమే ఆంధ్రకుకూడా ఉపయోగపడుతున్నది. 610 నమూనాలను ఆ కేంద్రంలో పరిశోధించారు.

మద్యనిషేధచట్టంప్రకారం 32,789 నేరాలను కనుగొన్నారు. నేరపరిశోధన బాగాజరిగింది. అక్రమంగా సారా తయారు చెయ్యడం చెట్లు గీసే నేరాల శాతం పట్టుపడినవి. మొత్తం 32,789 నేరాలలోనూ 17,009 నేరాలు అక్రమంగా సారాకాచే నేరానికి సంబంధించినవి.

చట్టవిరుద్ధంగా చెట్లు గీసిన నేరాలు 4,691 జరిగినవి. అక్రమంగా సారా రవాణా చేసిన నేరాలు 1542 జరిగినవి.

అక్రమంగా సారా తయారు చేసే వారిలో రకరకాల మనుషులున్నారు. పాకం నేరాలు రోజు రోజుకూ ఎక్కువవుతున్నవి. అలవాటుగా సారా కాచేవాళ్లు రకరకాల వస్తువులను వాడుతున్నారు.

సైకిల్ ట్యూబ్ లలోనూ, సీసాలలోనూ, మోటారుకారులలోనూ అక్రమంగా సారా రవాణా జరుగుతున్నది.

ఆడపిల్లలు ఎక్కువగా వున్న వారికి ... సారా కాస్తారు. మద్యనిషేధశాఖ సిబ్బందిపనిస్తున్నారని తెలియగానే పాత్రలు ఎక్కడో పడవేసి

ఆచూకీ తెలియడానికి వీలు లేకుండా పారిపోతారు. ఇట్లా చేసేవారందరికీ ఎవరో ఒకరు అండవుంటారు. అండగా నిలిచేవారు బయటపడరు. లాభాలు మాత్రమే వాళ్ళవి.

చట్టవిరుద్ధంగా చెట్లు గీసే నేరాలు ఎక్కువగా ఉభయగోదావరి నెల్లూరు జిల్లాలలో జరుగుతున్నవి. తీపికల్లు గియ్యడానికి యిచ్చిన అనుమతులను ఇట్లాదుర్వినియోగం చేస్తున్నారు. ఆ అనుమతులు ఇవ్వకపోతే గీతపనివారికి పొట్ట గడవదు. అనుమతులదుర్వినియోగాన్ని అరికట్టేందుకు మద్యనిషేధ శాఖ సిబ్బంది శాయశక్తుల కృషి చేస్తున్నారు.

### మైసూరు నుంచి గంజాయి

గంజాయి సాధారణంగా మైసూరు నుంచి ఆంధ్రకు రవాణా అవుతుంది. ఈ అక్రమ రవాణాను అరికట్టేందుకు ఉపయోగపడే చర్యలు పరిశీలనలో ఉన్నవి.

సుమారు రు. 36 వేలు చేసే 75 సేర్ల 8 తులాల నల్లమందును మద్యనిషేధ సబ్ ఇన్స్పెక్టరు సహాయంతో రాజమండ్రి సబ్ ఇన్స్పెక్టరు పట్టుకున్నారు ఇటార్సినుంచి ఆ జిల్లాలో అమ్మకానికి తెచ్చినట్లు తెలుస్తున్నది.

ఇరుగు పొరుగు రాష్ట్రాల సరిహద్దులలో సారా. అక్రమ రవాణా జరుగుతున్నది. బందోబస్తు ముమ్మరంగా చేసి నేరాలు తగ్గించడానికి ప్రయత్నం జరుగుతున్నది.

### ప్రజా సహకారం లేదు

మద్యనిషేధ శాఖ సిబ్బందితో పోలీసు శాఖ బాగానే సహకరిస్తున్నారు కాని ప్రజా సహకారమే బొత్తిగా లేదనాలి. గ్రామమునసబులు, గ్రామాధికారులు మద్యనిషేధ శాఖ సిబ్బందితో దెబ్బలాటకు దిగిన సందర్భాలు లేకపోలేదు. ఎక్కడో కాపుసారా తయారుచేస్తున్నారని మహజరు పెట్టి విచారణలో భయంవల్ల మహజరుదారు జారుకుపోయిన సందర్భాలు కూడావున్నవి.

### తీపికల్లు కల్లుఅవుతున్నది

తీపికల్లు గియ్యడానికి ఇచ్చిన అనుమతులను ఉభయ గోదావరి జిల్లాలలో దుర్వినియోగమైనటు ఫిర్యాదులు వస్తున్నవి. కల్లుకు వచ్చేధర బెల్లానికి రాదు. ఈనాటి ఆర్థిక స్థితిగతులలో మాజీగీత పనివారికి కల్లు తయారుచెయ్యడమే లాభసాటిగా కనిపిస్తుంది.

మద్యనిషేధ నేరాల విచారణలో ముఖ్యంగా న్యాయపరిపాలనా నిర్వహణ శాఖల విభజన జరిగిన జిల్లాలలో చాలా తేలిక శిక్షలు విధిస్తున్నారు. అందువల్ల నేరస్థులు ఆ పనిమానివెయ్యడం లేదు.

వీటన్నింటికీ తోడు రవాణా సౌకర్యాల కొరత, తగినంత మంది సిబ్బంది లేకపోవడం, ముఖ్యంగా ప్రజసహకారం లేకపోవడం వంటి అవరోధాలు చాలా ఉన్నా నేరాలను తగ్గించే విషయంలో మద్యనిషేధశాఖ చాలా బాగానే పనిచేశారు. ఈ పరిస్థితులలో వారు చేసిన కృషి సంతృప్తికరంగానే ఉన్నదనాలి.

1954 జనవరిలో ప్రభుత్వం నియమించిన మద్యనిషేధ పరిశీలక సంఘం చేసిన సిఫార్సులు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నవి.

## రష్యా నాయకులకు మద్రాసు స్వాగతం

1 వ పేజీ 3 కాలం తరువాయి

జనం, ముఖ్యంగా స్త్రీలు, పిల్లలు ఉభయదేశాల పతాకాలను ఊపుతూ, పూలను చల్లారు. విమానాశ్రయంలోను, రోడ్డువెంబడీ, అనేక చోట్ల సోవియట్ నాయకులను స్వాగతించే హిందీ, రష్యన్, తమిళభాషల్లో వ్రాసిన తోరణాలు ఎన్నో కనిపించినవి. ఎంతో చక్కగా అలంకరించబడ్డ ఆ తోరణాల కిందికి సోవియట్ నాయకులు రాగానే, వారి మీద పూలవానకురిసింది.

విపరీతమయిన జన సమ్మర్దం వల్ల మీనంబాకంనుంచి రాజభవనానికి రావటానికి 1 గంటపట్టింది.

రాజభవన్ వద్ద నాగస్వరంతో స్వాగతం ఇచ్చారు. అలంకరించిన ఏనుగులు సోవియట్ నాయకులకు పూలమాలలు వేసినవి.

### కదళీకేళం: పొటెటోమాటో

సోవియట్ నాయకులకు స్వాగతం ఇచ్చే సందర్భంలో మీనంబాకం విమానాశ్రయంలో అరటిచెట్లకు కొబ్బరి గెలలను కట్టటం జరిగింది. అరటి చెట్లకే అవి కాసినవా అన్నటున్న వాటిని రష్యన్ బృందంలో ఒకరు చూశారు.

"అరటిపళ్ళనూ, కొబ్బరికాయలనూ కూడా కాసే చెట్లను భారతశాస్త్రజ్ఞులు నిజంగా సృష్టించకలిగినా ఆశ్చర్యం లేదు. సోవియట్ యూనియన్ భూమి మీద కొమ్మలకు టొమాటో కాయలను, భూమిలో పల బంగాళాదుంపలనూ కాసే పొటోటొమాటో చెట్లను సృష్టించారు. దానిమీద పరిశోధనలు జరుగుతున్నవి" అని ఆయన అన్నారు.

### సమిష్టి నాయకత్వం

సోవియట్ సమిష్టి నాయకత్వానికి అభినందనలు ... పద్ధతిలో ... స్వాగతం ... శ్రీ బుల్గానిన్ ... శ్రీ క్రుశ్చేవ్ ... స్వాగతం ... శ్రీ బుల్గానిన్ క్రుశ్చేవ్ కి స్వాగతం అని వున్నది

## వరిపంటలో ప్రథమ బహుమతి

### అనంతపురం తాలూకా రైతు కృషి

అనంతపురం, నవంబర్ 26: ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు ఈ ఉదయం ఇక్కడికి వచ్చి పంటపోటీలలో ఎకరం భూమిలో 10061 పౌనుల ధాన్యం పండించి తాలూకా, జిల్లా, ప్రాంతీయ బహుమానములు గెలుపొందిన అనంతపురం తాలూకా పసుమటి యూలేరు రైతు సి. జాకోబ్ రెడ్డిగారిని అభినందించారు. బహుమతి ప్రదానోత్సవం రాయలసీమ ప్రదర్శనశాల ఆవరణలో ఏర్పాటు అయింది. అధికారులు రైతులు అనేకులు పాల్గొన్నారు. ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు కూడా వచ్చారు.

జిల్లా వ్యవసాయాధికారి శ్రీ బి. ఆదిశేషారెడ్డి నివేదిక సమర్పిస్తూ యుద్ధకారణంగా దేశములో ఏర్పడిన ఆహారకొరత తీర్చటానికి అనేక ప్రణాళికలు వేశారని అందులో పంటల పోటీ ఒకటిఅని 1954-55 సంవత్సరములో 4212 మంది పోటీచేసి అందులో ఒకరు 10,061 పౌన్ల ధాన్యముపండించి కడప, చిత్తూరు అనంతపురం జిల్లాలలో ప్రథమ బహుమతి సంపాదించారని తెలియజేశారు.

గోపాలరెడ్డిగారు ప్రసంగిస్తూ విద్యా వ్యవసాయ రంగములలో ఇతర జిల్లాల కంటె అనంతపురంజిల్లా శ్రద్ధతో ముందడుగు వేస్తున్నందుకు అభినందించారు. "ప్రపంచపు పంట దామాషాతో పోల్చిచూచో ఆంధ్ర రైతు చాల వెనుకబడి ఉన్నాడని ఆ ప్రమాణాన్నందుకొనగలడా యని అనుమానించేవాడిని. కాని నీటివసతి చక్కగాలేని నిరంతర క్షామపీడితమై వెనుకబడి ఉన్నదనుకొన్న అనంతపురంజిల్లా రైతే, ఆ సగటు ప్రమాణాన్ని అధిగమించాడంటే దేశంలో ఆహారం సమృద్ధిగా పండించి ఉంకా ఇతరదేశాల కెగుమతి చేయగలమని తద్వారా దేశ ఆర్థిక స్థితి పెంపొంది పురోగమించగలమను ఆశకలుగుతున్నది. ఎక్కువ వ్యవసాయ వసతులు కల్పించి నవీన ఉత్పత్తి మార్గాలు నేర్పిగే ప్రతి తాలూకా జిల్లా స్వయంపోషక మవుటయేగాక ఇరుగు జిల్లాలకు ఇతోధికంగా సహాయం చేయగలవు. గెలుపొందినవారు అనుసరించిన మార్గాలను ఇతరులకు చూపి నేర్పుట మంచిది. వ్యవసాయ వసతులు కొరతగా ఉండి, క్షామపీడితాలగు ప్రాంతంవారు కృష్ణా, గోదావరి జిల్లాలవారికంటె అధికంగా పండించటం విచిత్రంగా ఉన్నది. కాని ఇరుప్రాంతములలో అనుసరించు సేద్యవిధానాలు పరిశీలించవలసియున్నది" అన్నారు.

జాకోబురెడ్డిగారికి ప్రాంతీయ బహుమతి రెండువందల నగదు 50 రూపాయలు విలుగల బంగారు పతకము జిల్లా బహుమానము నూరు రూపాయలు నగదు యిచ్చారు. ఇవిగాక తాలూకా తీర్పు బహుమానములు కూడా యిచ్చారు.

జిల్లాకలెక్టరు శ్రీ. కొండలరావుగారు, మంత్రులకును ఇతరులకును ధన్యవాదములు తెలియజేశారు.

## వాతావరణం

| కేంద్రం | గత 24 గంటలలో | జనవరి 1 నుంచీ | సంవత్సర సరాసరి |
|---|---|---|---|
| కళింగపట్నం | — | 52.2 | 40 |
| గన్నవరం | — | 44.2 | — |
| కాకినాడ | — | 51.7 | 41 |
| బందరు | — | 51.1 | 41 |
| నెల్లూరు | — | 24.0 | 39 |
| నిడదవోలు | — | — | — |
| రెంటచింతల | — | — | 34 |
| విశాఖపట్నం | — | 38.0 | 28 |
| అనంతపురం | — | — | 38 |
| మదనపల్లె | — | 26.1 | 24 |
| | — | 22.8 | 28 |
| కడప | — | — | 30 |
| కర్నూలు | — | 40.9 | 25 |
| మదరాసు | — | 44.7 | 50 |
| బెంగుళూరు | — | — | — |
| బళ్లారి | — | 28.4 | 2029 |
| హైదరాబాదు | — | 42.8 | 3 |
| న్యూఢిల్లీ | — | 31.6 | 26 |

## తడి ఆరేటట్లు చేసే రసాయనిక సాధనాలు

న్యూఢిల్లీ, నవంబరు 27: తడిగా వున్న పదార్థాలతడిని ఆరేటట్లు చేసే రసాయనిక వస్తువులను బొగ్గునుండి ఉత్పత్తిచేసే ప్రక్రియను, ఫ్యూయల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్ వారు కనిపెట్టారు. పెట్రోలియమ్ పరిశ్రమ, ఎరువుల ఉత్పత్తి, మంచుగడ్డ శాకతైలాల పరిశ్రమ, మొదలైన పరిశ్రమలలో నిర్ద్రవమైన వాయువులను ఉపయోగిస్తారు. ఇప్పుడు మామూలుగా వాయువులను సిలికాగెల్ అనే పదార్థాలతో తడి ఆరవేస్తున్నారు. ఈ కొత్తరకం రసాయనిక పదార్థాలు సిలికాగెల్ కంటే ప్రశస్తమైనవని తెలుస్తున్నది.

## కోయంబత్తూరులో ఇత్తడిపాత్ర బహుమానం

కోయంబత్తూరు, నవంబరు 28: సోవియట్ నాయకులు మద్రాసు బయలుదేరటప్పుడు ప్రధాని శ్రీ బుల్గానిన్ కు ఒక చక్కటి ఇత్తడిపాత్ర బహూకరించారు దానిమీద లెనిన్ గాంధీ. నెహ్రూ, బుల్గానిన్ల రేఖాచిత్రాలు చెక్కబడ్డవి.

శ్రీ బుల్గానిన్ కి చక్కటి చేనేత చీరకూడ బహూకరించారు.

## కాశ్మీర్ పై పాక్ అఖిలపక్ష సభ

### ఏకగ్రీవ తీర్మానం సాధ్యమయ్యే సూచన

కరాచీ, నవంబరు 27: సర్వపక్ష కాశ్మీర్ మహాసభ నేడు 'సాధారణ చర్చ'ను ముగించిందని, యీ రెండు రోజుల చర్చలలో వెలువడిన వివిధ అభిప్రాయాలనూ, చేసినసూచనలనూ ప్రతిబింబిస్తూ తీర్మానాలు తయారు చేయటానికి ఒక సంఘాన్ని యేర్పాటుచేసిందనీ యీరాత్రి ప్రకటించారు.

ఈ తీర్మానాలను రేపటి సమావేశం ముందు ఉంచుతారట.

ఈ సంఘంలో ప్రధానిచౌదరీ మహమ్మదలీ, వ్యతిరేకపక్ష నాయకుడు శ్రీ హెచ్. యస్. సుహ్రవర్ది, పూర్వం సింధు గవర్నరుగా వుండిన శ్రీ దిన్ మహమ్మద్ సభ్యులు.

నేటి చర్చలలో కూడా ఐక్యం, అవలంబింప వలసిన వైఖరి విషయంలో ఏకాభిప్రాయం కనిపించిందనీ,కూడా ప్రకటనలో ఉంది. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, భారత దేశంలో పాకిస్తాన్ ప్రతినిధిగా ఉంటున్న రాజా గజనఫరలీఖాన్, ఆజాద్ పాకిస్తాన్ పక్ష నాయకుడు మియాం ఇఫ్తికరుద్దీన్ ప్రభృతులు పాల్గొన్నారట.

మొత్తంమీద ప్రసంగాలు, కాశ్మీర్ తగాదాను త్వరగా, శాంతియుతంగా పరిష్కరించుకోవాలనే ధోరణిలోనే వున్నవని మహాసభ వర్గాలవారన్నారు.

మహాసభ తుదకేమి నిశ్చయిస్తుందో చెప్పటం కష్టమనీ, అయితే భారత ప్రధానిని కలుసుకొని మాట్లాడవలసిందిగా ప్రధాని మహమ్మదలీని కోరదనటానికి వీలులేదనీ సంగతి సందర్భాలు తెలిసినవారన్నారు. ఆ సమావేశంవల్ల ఫలితం లేకపోతే పాకిస్తాన్ దీనిని భద్రతామండలి ముందుకు తీసుకుపోవచ్చునన్నారు.

### ఖాన్ సోదరులు రాయబారం జరపాలట

మహాసభలో నేడు ఒకరు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, డాక్టర్ ఖాన్ సాహెబ్ భారతదేశం వెళ్ళి కాశ్మీర్ తగాదా పరిష్కారానికి రాయబారం జరపాలని సూచించారట. మరొకరు భారతదేశం కాశ్మీరుకు ఇచ్చినట్టి స్వేచ్ఛను పాకిస్తాన్ ఆజాద్ కాశ్మీరుకు ఇవ్వాలన్నారట. ఇంకొకరు శాంతియుత పరిష్కారం మంచిదే అయినప్పటికీ, తుదకు యుద్ధంవల్ల గాని ఇది పరిష్కారం కాదని తనకనిపిస్తున్నదన్నారట. వేరొకరు అమెరికా సైనిక సహాయాన్ని నిశితంగా విమర్శించారట.

### అఫ్గనిస్తాన్ తో సంప్రతింపుల సూచన

గవర్నర్ జనరల్ మేజర్ జనరల్ ఇస్కందర్ మీర్జా ఇవ్వాళొకచోట మాట్లాడుతూ అఫ్గనిస్తాన్ చిక్కులు తొలగించేందుకు ఆ దేశఘటనా పాకిస్తానీయులా కూర్చొని సంప్రతించుకోవటం మంచిదని సూచించారు.

దీనికిముందూ ఆయన అఫ్గనిస్తాన్ ఫక్తూనిస్తాన్ ఏర్పరచాలనటం పాకిస్తాన్ ప్రాంతం కొందాలనే దుర్భావంతో నే ననీ, పాకిస్తాన్ ఒక్క అంగుళం స్థలాన్ని కూడా వదలదని అన్నారు.

## మిల్లు ఉత్పత్తిని అదుపు చేయడం మంచిది కాదు

### చేనేతకు ప్రతిబంధకం అని శ్రీ కృష్ణమాచారి వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 28: మిల్లులలో నూలు తయారీ ఇక పెంచరాదని కార్వేసంఘం చేసిన సూచన చేనేత పరిశ్రమకే ప్రతిబంధకమవుతుందని, భారత వాణిజ్య పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి అన్నారు.

చేనేత సంఘం 6-వ సమావేశంలో మాట్లాడుతూ, ఈ సూచనను ఆమోదిస్తే ప్రస్తుతం చేనేత పరిశ్రమ కేమీ ఉపకారం జరగదనీ, ముందు సంగతి ఎవరికి పట్టిందనీ ఆయనన్నారు.

చేనేతవారికి ఇప్పుడే నూలు సరిగ్గా అందటం లేదు. 40-వ నంబరుపైన ధరలు పెరిగిపోతున్నాయి. ఎగుమతికి అనుమతించింది మిల్లులు తయారు చేసే నూలులో కొంత భాగమే. ఎక్కువ నూలు తయారు చేసేటట్లు ప్రోత్సహించటానికే ఆ అనుమతి ఇవ్వటమయింది.

నాజూకురకం నూలు తయారుచేసేటందుకు ప్రభుత్వమే రెండు మూడు మిల్లులు పెట్టాలనుకొంటోంది. ఆ నూలును చేనేతవారికే సరఫరా చేస్తుంది. ఆ నూలు కావలసివున్నా, తగిన లాభాలు వచ్చేటట్లున్నా కూడా ప్రయివేటు వ్యాపారులు ఇందుకు ముందుకు రావటంలేదు. ప్రభుత్వం లక్ష కదుళ్లు ఏర్పర్చ గలిగితే సాలుకు 75 లక్షలు లాభం రాగలదు. ఇట్లా చేస్తే ప్రయివేటు మిల్లులకు పోటీకూడా ఏర్పడి, ధరలు తగ్గే అవకాశంకూడా కలుగుతుంది. యిదంతా మనస్సులోవున్నది చెప్పటం మాత్రమే. ప్రభుత్వం ఇంకా నిర్ణయ మేమీ చేయలేదు. అని శ్రీ కృష్ణమాచారి అన్నారు.

## భోపాల్ రాజధాని

గ్వాలియర్, నవంబరు 27: కొత్త మధ్యప్రదేశ్ రాష్ట్రానికి భోపాల్ను రాజధానిగా ఏర్పరచటానికి కాంగ్రెస్ అధిష్ఠానవర్గం దాదాపు నిర్ణయించి వేసినట్లే నని మధ్యభారత్ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు కన్నయ్యలాల్ ఖాదీవాలా అన్నారు.

# తెనాలి తాలూకాలో సారాబట్టీలు

## 30 మంది అరెస్టు

### కొందరు స్త్రీలుకూడాను

తెనాలి, నవంబరు 25: డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు పి. కామేశ్వరరావునాయుడుగారు, తెనాలి తాలూకా సర్కిల్ ఇన్‌స్పెక్టరు సి. వీరాస్వామినాయుడు, సబ్ ఇన్‌స్పెక్టర్లు ఎం. రామస్వామి, ఎన్. సుబ్బారావు గారలను, కొంత పోలీసు సిబ్బందిని వెంటబెట్టుకొని, 16 వ తేదీన, ఎడ్లపల్లి గ్రామంలో దాడిచేసి 7 బట్టీలు పట్టుకొన్నారు. 6 గ్యాలన్ల సారా, 600 గ్యాలన్ల ఊటగల 50 బానలు స్వాధీనం చేసుకొన్నారు. ఊటంతా ధ్వంసం చేశారు.

ఆ సందర్భంలో 7 గురిని అరెస్టుచేసి కేసులు రిజస్టరుచేశారు. అరెస్టయిన వారిలో యిద్దరు ఆడవాళ్లు కూడా ఉన్నారు.

15 వ తేదీన సర్కిల్ ఇన్‌స్పెక్టరు సి. వీరాస్వామి నాయుడు గారు, సబ్ ఇన్‌స్పెక్టర్లు సి. హెచ్. జార్జి, ఎస్. రాధాకృష్ణమూర్తి గారలను, కొంత సాయుధపోలీసుసిబ్బందిని వెంటబెట్టుకొనివెళ్లి కూచిపూడి గ్రామంలో దాడిచేశారు. 2 గ్యాలన్ల సారా, 700 గ్యాలన్ల ఊటఉన్న 20 బానలు పట్టుకొన్నారు. ముగ్గురిని అరెస్టుచేశారు.

అదరోజున వారు శృంగారపురం గ్రామంలో 6 గురిని అరెస్టుచేసి, 4 గ్యాలన్ల సారా, 1200 గ్యాలన్లు ఊట ఉన్న 45 బానలు పట్టుకొన్నారు. అరెస్టయినవారిలో ఒక స్త్రీ కూడా ఉన్నది.

19 వ తేదీన డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు పి. కామేశ్వరరావు నాయుడుగారు, తెనాలి తాలూకా సర్కిల్ ఇన్‌స్పెక్టరు పి. వీరాస్వామి నాయుడు, సబ్ ఇన్‌స్పెక్టర్లు ఎం. అశం, సి. హెచ్. జార్జి, ఎం. రామస్వామి, ఎన్. సుబ్బారావుగారలు దావులూరిపాలెం గ్రామంలో దాడిచేసి 8 బట్టీలు 10 గ్యాలన్ల సారా 600 గ్యాలన్ల ఊటవున్న 40 బానలు పట్టుకొన్నారు. ఊట ధ్వంసం చేశారు. 13 గురిని అరెస్టు చేశారు. అరెస్టు అయిన వారిలో 4 గురు స్త్రీలు.

## భీమవరంలో సారా నేరాలు: శిక్షలు

భీమవరం, నవంబరు 28: చట్టవిరుద్ధంగా సారా దగ్గర ఉంచుకొన్న నేరానికిగాను, ఏసుల ముసలమ్మ, గాలి సుబ్బారావు, చెరి రెండు నెలల కఠిన శిక్ష, కోడి వెంకన్నకు రు 60 జరిమానా, వాడపల్లి శేశవరావు, రామని పెదలచ్చికి చెరి రు 40 జరిమానా, వార్ల బుచ్చమ్మ, పాల సింహాచలం, చిన్నం వెంకన్నకు చెరి రు. 20 జరిమానా స్థానిక సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటు విధించారు.

నర్సాపురం డిప్యూటీ ప్రాహిబిషన్ ఆఫీసర్ భీమవరం ప్రాహిబిషన్ సబ్ ఇన్‌స్పెక్టరు వి. వెంకరాజు గారి సహాయంతో ఈ నెలలో దాడిజరిపి, వీరిపై ఈ కేసులు పెట్టారు.

## అక్కాయపాలెంలో 4 గురి అరెస్టు

చీరాల, నవంబరు 24: నిన్న ఈ వూరి సమీపానవున్న అక్కాయపాలెంలోపులో ఒంగోలు డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు యం. ఐ. దీనదయాళు నాయుడుగారు స్థానిక పోలీసువారి సహాయముతో దాడిచేసి 20 గాలెన్ల సారాయిని పట్టుకొని 50 గాలెన్ల ఊటను నాశనము చేశారు. ఈ సందర్భములో 4 గురిని అరెస్టుచేసి దరిమిలా జామీనుమీద విడిచిపుచ్చారు.

## సైప్రెస్‌లో బ్రిటిష్ రేపిన కల్లోలం

నికోసియా, నవంబరు 26: గతవారంలో జరిగిన కల్లోలాలలో 5 గురు బ్రిటిష్ సైనికులు హతిమైనందున సైప్రెస్ అంతటా అత్యవసర పరిస్థితి ఏర్పడినట్లు బ్రిటిషు అధికారులు ప్రకటించారు.

# కుదరవల్లిలో ఖూనీసంఘటన

## 12 మందికి జామీను నిరాకరణ

బందరు, నవంబరు 23: గుడివాడ తాలూకా కుదరవల్లి గ్రామములో యిటీవల జరిగిన డొమ్మీ ఖూనీకేసుల సందర్భమున గుడివాడ పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు పి. ఆర్. సి. 5/55 ప్రకారం 45 గురుపై 147, 148, 149, 323, 324, 326, 426, 302 సెక్షన్ల క్రింద నేరారోపణపత్రం దాఖలు చేశారు. 35 గురుపై ఐ. పి. సి. 147, 148, 149, 323, 324, 302 సెక్షన్ల క్రింద అభియోగం మోపారు. ఈ రెండు అభియోగములలోనూ ముద్దాయిలు ఘస్టుక్లాసు మేజస్ట్రేటువద్ద జామీనుపై విడుదలకు దరఖాస్తు పెట్టుకొన నిరాకరించబడినది. అందుకై సెషన్సుజడ్జివద్ద అప్పీలుచేసుకోగా 12 మంది మినహా మిగతా వారికి జామీను మంజూరుచేశారు. ఈ దిగువ వారికి జామీను నిరాకరించారు. అళ్ల ఈశ్వరరావు, కొత్రగడ్డ నరసింహారావు, సెక్కలపల్లి జగన్నాధరావు, అన్నె వెంకటసుబ్బారావు, మూర్తి అప్పలస్వామి, కొకర్ల సీతారామదాసు, నవకో సూర్యనారాయణ, రాజమహేంద్రవరపు రామదాసు, అప్పల పరమేశ్వరుడు, రావినూతుల హరినారాయణ, ఈ గోవిందనారాయణ, పొట్లూరి రఘురామయ్య.

## మేకవానితోట గ్రామస్థుని అరెస్టు

బందరు, నవంబరు 24: రాబర్టుసన్‌పేట సబ్ ఇన్‌స్పెక్టరు అన్నె రామమోహనరావుగారు, యీ తాలూకా మేకవానితోట గ్రామస్థుణ్ని, మొన్న 19 వ తేదీన, రిక్షాలో వెళుతుండగా అరెస్టుచేశారు. అతనివద్ద 500 సొత్తు కూడా స్వాధీనంచేసుకొన్నారు. ఈ సొత్తు 5-9-55 తేదీ బందరు మిషన్ కాంపౌండులో దొంగిలించినదని అనుమానింపబడుతున్నది.

## ఉద్యోగవార్తలు

కర్నూలు, నవంబరు 25: అడ్మినిస్ట్రేషన్ ఆఫీసరుగా ఉంటున్న వి. సుందర్ సేన్ గారిని, హోంశాఖ సహాయ కార్యదర్శిగా ప్రభుత్వం నియమించింది. ప్రస్తుతం నిర్వహిస్తున్న స్పెషల్ డ్యూటీ పూర్తి అవగానే, యీ కొత్త ఉద్యోగాన్ని ఆయన స్వీకరిస్తారు.

# రంగస్థలంపై నటుని మూర్ఛ

## చీరాల మేజిస్ట్రేటుచే 2 నెలల ఖైదు

చీరాల, నవంబరు 22: తెనాలి వాస్తవ్యుడు సుప్రసిద్ధ నటుడగు షణ్ముఖ ఆంజనేయరాజు త్రాగిన నేరమునకుగాను చీరాల సబ్ మేజిస్ట్రేటు మద్యపాన నిషేధచట్టం 4(ఎ) సెక్షన్ క్రింద 2 నెలలు విడిఖైదు విధించారు.

ఈ సందర్భంలో ఈ క్రింది విషయములు తెలిసినవి.

షణ్ముఖ ఆంజనేయరాజు ఈవూరి సత్యనారాయణ టాకీసులో 19.11-55 రాత్రి ఏర్పాటు చేయబడిన "సీతారామాంజనేయ యుద్ధనాటకము"లో నటించుటకు ఒప్పుకొనివచ్చి నాటక రంగము మీద క్రిందపడిపోయాడు. అంతట ఆయనను లేవదీయగా ఆయన ఒళ్లుపై తెలియకుండా త్రాగినస్థితిలో ఉన్నాడట. అంతట చీరాల పోలీసువారు ఆయనను అరెస్టుచేసి మరునాడు చీరాల సబ్ మేజస్ట్రేటుగారి కోర్టులో హాజరుపరచారు. విచారణలో ముద్దాయి నేరము ఒప్పుకొన్నాడు. సబ్ మేజస్ట్రేటు ముద్దాయికి 2 నెలల విడిఖయిదు విధించారు. కాని నిన్న ముద్దాయి అప్పీలు చేసుకొనెదనని జామీను పిటిషన్ దాఖలు చేయగా మేజస్ట్రేటుగారు ముద్దాయిని బెయిల్ మీద విడుదల చేశారు.

# కర్నూలు ఆసుపత్రి క్షయవిభాగం

## శ్రీ వెంకటరావుచే ప్రారంభోత్సవం

కర్నూలు, నవంబర్ 27: ఆరోగ్యమంత్రి శ్రీ కళా వెంకట్రావు నేటిఉదయం ఇక్కడి జనరల్ ఆస్పత్రిలో క్షయవార్డుకూ, పైతరగతులవారి ప్రత్యేక వార్డుకూ, రక్తపు నిధికీ ప్రారంభోత్సవం చేశారు.

ఈ ఆస్పత్రి అభివృద్ధికి ప్రభుత్వము 14 లక్షలు మంజూరు చేసిందనీ, విశాలాంధ్ర వచ్చినా కర్నూలును విస్మృతము చేయరనటానికి ఇది తార్కాణమనీ ఆసందర్భంలో వారు అన్నారు. జగన్నాధుని గట్టుదగ్గర శానిటోరియం ఏర్పాటు చేయటానికి స్థానికులు 50 వేలు ఇస్తే ఆ పనికూడా జరుగుతుందన్నారు.

సభకు ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. స్థానిక సంస్థల మంత్రి శ్రీ నాగేశ్వరరావు, సహకార మంత్రి శ్రీ సంజీవయ్య, శాసన సభ్యులు, ఉద్యోగులు చాలామంది హాజరైనారు.

వైద్యశాఖాధికారి మేజర్ కె.ఎన్. రావు సభాసదులకు స్వాగతమిస్తూ, రక్షణశాఖ వ్యయము తరువాత ప్రజారోగ్యశాఖ వ్యయమే ప్రధానమనీ, మూడవ పంచవర్ష ప్రణాళికలో వైద్య, ఆరోగ్యశాఖలకు ప్రాధాన్యము రాగలదనీ అన్నారు.

ఆసుపత్రి సూపరింటెండెంటు డాక్టర్ హుస్సేన్ ఆసుపత్రి వంద ఏండ్లలో పొందిన అభివృద్ధిని వివరించారు. త్వరలోనే ఇక్కడ ప్రారంభమయే వైద్యకళాశాల ఆసుపత్రిలో జరుగబోయే అభివృద్ధి పనులతో ఈ రాష్ట్రములోనే కాక యావద్భారతములో ఆదర్శసంస్థగా వెలయగలదని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ వెంకటరావు రెండవ పంచవర్ష ప్రణాళికలో వైద్య, ఆరోగ్యశాఖలకు 8 కోట్లు ఖర్చుపెట్టటానికి అంచనాలు వేస్తున్నారనీ, అందుకు వైద్య పట్టభద్రుల సహాయము ఎక్కువ అవసరమనీ, ఇక్కడ వచ్చే యేడాదినుంచీ వైద్యకళాశాల ప్రారంభం కాగలదనీ అన్నారు.

ముఖ్యమంత్రి విశాలాంధ్ర నిర్మాణములో నిమిత్తము లేకుండానే ఈ ఆసుపత్రి వృద్ధిచెందిలీరుతుందన్నారు. ప్రజల్లో చైతన్యము అభివృద్ధిఅయి, విద్యా వైద్య సౌకర్యాలకోసము ఆందోళన జరుగుతూ వుండటము, ఆ సౌకర్యాలు దినదిన ప్రవర్ధమానమవుతూండటము సంతోషకారణమన్నారు. రెండో ప్రణాళికలో 60 లక్షలు ఆసుపత్రులకోసము వినియోగము కాగలదనీ, వైద్యకళాశాలకు మంచి సమర్థులయిన ఉపాధ్యాయ బృందము వుండటము చాలా అవసరమనీ అన్నారు.

జిల్లా సహాయ వైద్యాధికారి శ్రీ ఆంజనేయులు నాయుడు అభివందనార్పించారు.

## ముఖ్య మంత్రి పర్యటన కార్యక్రమం

కర్నూలు, నవంబరు 26: ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు, యీ నెల 30వ తేదీన వాల్తేరు వెళతారు. 2వ తేదీన, హాస్టల్ల సారస్వత సంఘంలో ఉపన్యసిస్తారు; 3వ తేదీన ఇండియన్ ఫార్మస్యూటికల్ అసోసియేషన్‌కు ప్రారంభోత్సవం చేస్తారు. హనుమంత వాక్‌లోని ప్రభుత్వ పాడి పరిశ్రమ కేంద్రాన్ని సందర్శిస్తారు. ఆ సాయంత్రం, ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టభద్రుల స్నాతకోత్సవంలో పాల్గొంటారు.

4వ తేదీ ఉదయం అనకాపల్లి వస్తారు ఆ ఉదయం కళాశాల అధ్యాపకుల మహాసభలో పాల్గొంటారు. కళాశాల లేబొరేటరీ భవనాలకు ప్రారంభోత్సవం చేస్తారు. ఆ మధ్యాహ్నం కర్నూలుకు బయలుదేరుతారు.

# ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు రాజకీయ సభ

## డిసెంబరు 10న నెహ్రూ ప్రారంభోత్సవం

కర్నూలు, నవంబరు 25: గుంటూరులో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఏర్పాటు చేస్తున్న రాజకీయ మహాసభను ప్రధాన మంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ డిసెంబరు 10వ తేదీ సాయంత్రం 5 గంటలకు ప్రారంభోత్సవం చేస్తారు. మహాసభ మార్కెటింగ్ హాలులో జరుగుతుంది. సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహిస్తారు.

ఉదయం 9 గంటలకు ప్రతినిధుల సమావేశం జరుగుతుంది.

ప్రదేశ్ కాంగ్రెసు సభ్యులు, పార్లమెంటులోని కాంగ్రెసు సభ్యులు, శాసనసభలోని ఐక్య కాంగ్రెసు సభ్యులు, జిల్లా కాంగ్రెసు సంఘాల సభ్యులు, తాలూకాపట్టణ కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు, ప్రతినిధుల సమావేశానికి రావలసిందిగా ఆహ్వానిస్తు అల్లూరి సత్యనారాయణరాజు గారు, యివాళ ఒక ప్రకటన చేశారు.

గవర్నరు శ్రీ త్రివేదీ నవంబరు 20 నాడు టంగుటూరు వంతెన వాడకానికి ప్రారంభోత్సవం చేశారు.

కడపలో అంధుల విద్యాలయాన్ని శ్రీమతి కుసుం త్రివేదీ నవంబరు 17 నాడు సందర్శించారు.

శ్రీమతి కుసుం త్రివేదీ కడప స్త్రీసంక్షేమ కేంద్రం లో నవంబరు 19 నాడు, పేదల పిల్లలకు పాలుపంచారు.



కడప హైస్కూలు మైదానంలో గవర్నరు దంపతుల గౌరవార్థం విద్యార్థులు వేడుకలు విన్యాసాలు జరిపారు.

# వ్యవసాయ పరపతి

## క్రయ విక్రయాలకు ఏర్పాట్ల పథకం

హైదరాబాదు, నవంబరు 27: రెండో పంచవర్షప్రణాళికలో సహకార అభివృద్ధి ప్రణాళికల క్రింద 1700 ప్రాధమిక వ్యావసాయక విక్రయ సంఘాలను ఏర్పాటు చేయడం జరుగుతుందని, ఇందులో ప్రతి ఒక్క సంఘం క్రిందా ఒక మండీ వుంటుందని, కేంద్ర మంత్రి డా॥ పంజాబురావు దేశముఖ్ నేడు ఇక్కడ తెలియజేశారు.

పీటికి ఏజంట్లుగా 12 వేల పరపతి సంఘాలు పనిచేస్తూ వ్యవసాయదార్ల అవసరాలు తీరుస్తూ వుండటమేగాక, పరుల అమ్మకానికికూడా బాధ్యత వహిస్తాయని ఆయన విశదం చేశారు.

విపణి సంఘాలకు, పరపతి సంఘాలకు చిన్న చిన్న గిడ్డంగులు వుండాలి గనుక గిడ్డంగులనుకూడా 6570 దాకా నిర్మించాలని ఆలోచనలు జరుగుతున్నట్లు డా॥ దేశ్‌ముఖ్ తెలియజేశారు.

ఇవిగాక లైసెన్సులమీద గిడ్డంగులను ఏర్పాటు చేయడంగూడా వుంటుందని, ఇలాటివి 1960-61 నాటికి 850 దాకా ఏర్పడ వచ్చునని సూచించారు.

వీటిని ఏర్పాటు చెయ్యడానికి ప్రభుత్వం సహాయం చేస్తుంది. పెట్టుబడిలో 6 కోట్లదాకా ప్రభుత్వం పెట్టుబడి వుంటుంది. గిడ్డంగులుకట్టడానికి అప్పుల క్రింద, గ్రాంటుల క్రింద రూ. 445 లక్షలదాకా కేటాయిస్తుంది. సిబ్బందికి మరో రూ. 140 లక్షలు విరాళాల క్రింద ఇస్తుంది.

ఈ పనులను అన్నింటిని చూచేందుకు కేంద్రీయ సహకార అభివృద్ధి, గిడ్డంగుల వ్యవస్థ ఒక తగిన పెట్టుబడితో త్వరలోనే ఏర్పడుతుంది.

హైదరాబాదు ముఖ్య మంత్రి శ్రీ రామకృష్ణారావు కూడా ఈసభలో మాట్లాడారు. దేశంలో సహకారోద్యమం ఆ ఉద్యమంలో పనిచేస్తున్నవారి యొక్క మర్యాదలేమివల్ల కాక, తగిన సిబ్బందీ లేక పోవడంవల్ల దెబ్బతిన్నదని, ఈ సహకార సంఘాల పనిని చూస్తున్న సిబ్బందికి తగినశిక్షణ లేక పోవడం ఇంకో లోపమని అన్నారు.

వీరు ఈ ప్రసంగాలను ఇక్కడ జరుగుతున్న అ॥ భా॥ మార్కెటింగు, కోఆపరేషన్ మహాసభలో చేశారు. శ్రీ రామకృష్ణారావు ఈ సభను ప్రారంభించారు. డా॥ పంజాబ్ రావ్ దేశ్‌ముఖ్ అధ్యక్షత వహించారు.









Printed and Publisher for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St, Madras-1, Editor S. Sambhu Prasad.